# రామప్రియ.

(అను కథల పుస్తకము)

గ్రంథకర్త.

"కోటీశతనయ"ను వారు

తాత. కృష్ణమూర్తి. బి. ఏ; యల్. టి.

---

పీఠిక

డాక్టర్. బుర్రా. శేషగిరిరావు ఎం. ఏ; పి. హెచ్. డి.
గారిచే వ్రాయబడినది.

---

పబ్లిషరు.

Mrs. తాత. కృష్ణమూర్తి.

భద్రాచలం.

(తూర్పు గోదావరి జిల్లా.)

 1932. [ వెల 12 అణాలు.

# FOREWORD.

A foreword to a little book of stories of andhra life in Telugu is a superfluity; at best it is a concession to custom, and of very doubtful value, especially when, before its publication, some atleast of the stories therein had already appeared in Magazines. The short story is, however, a new type of literary venture in Telugu. In its bestforms it developes a single incident with all the art and craft skill of the novel. If the drama does in shorter compass and greater intensity what the novel seeks to do on a larger scale and space, the short story still further reduces the novel to a miniature scale. The glamour, the suspense, the expectation, the irony, the searching and the revelation, the aspiration and realism,—these form the real attractions of fiction,–novel, drama or short story. It has been the earnest endeavour of the author to invest his tales with such attractions. His novitiate effort in this line may not have been always successful, but the tendency is unmistakable; and that is what makes these tales bear a second reading.

The substance of these stories is current andhra life; especially in young men and women. It is not a mere expansion of a neo—romantic formula. The struggle of ideals amidst realities, the dissillusionment of romance, the snobberies

of social life and the battle of traditional habits and tendencies with modern ideas are depicted with fervour and critical sympathy. It is this that matters. The author has not become world-weary. He has made the narrator a young, hopeful, loving, ardent enthusiast of a literary artist and, perhaps, with excusable chivalry, he has depicted his young (conventional or unconventional?) wife as the more interesting personality. The characters no doubt fall naturally into types, but they are not mere mouth pieces of the author.

My hearty blessings for its well deserved success.

*Vizianagram,*
15-12-32.

B. SESHAGIRI ROW,
*Professor, Maharajah's College.*

# విషయసూచిక. *



* పైకథలలో కొన్ని "భారతి" లోను "గృహలక్ష్మి" లోను, లోగడ ప్రచురింపబడి యుండెను.



# రామప్రియ.

"తావలచినది రంభ!" అని లోకోక్తి. తానను మానించి, ద్వేషించి, తగవు పెట్టుకున్నదో?

మంచి వయస్సులో ఉన్న పడుచుపిల్ల స్వేచ్ఛగా సరసాలాడుతూ, ప్రేమతో నవ్వేటప్పుడు, యెట్టికురూపిదైనా అందంగానే కనిపిస్తుంది, ప్రియుడికళ్ళకు. గారపళ్ళుకూడా ఆణిముత్యాలవలె జిగజిగ మెరుస్తాయి. నత్తిమాటలైనా కోయిల పలుకులవలె యెంతో మధురంగా వినిపిస్తాయి. చీపిరికళ్ళయినా మన్మథ బాణాలవిరజల్లే మీన నేత్రాలై ప్రకాశిస్తాయి. రాక్షసి రూపుకి దేవత్వం వస్తుంది. పేడకుప్పలో ఇంద్రధనస్సు రంగులు గోచరిస్తాయి! అట్లే, పరిస్థితులనుబట్టి జగన్మోహనాకారంగల స్త్రీ, భర్తకంటికొక్కొక్కప్పుడు వికృతరూపం దాల్చి అసహ్యంగా, రోతగా, భయంకరంగా సాక్షాత్కరిస్తుంది.

భార్య రూపాని కానిమిషంలో నిజంగా భయపడి, యేవగించుకొని, ముఖం తిప్పేసుకున్నాడు ప్రకాశ్. ఉండి ఉండి ఉద్రేకంతో పైకిపొంగే దుఃఖాన్ని అణచుకొంటూ,

ఒళ్లుమరచిన క్రోధావేశంచేత, అతన్ని అనరాని మాటలాడుతూ, సాధిస్తూ, ఢీకొడుతూ, సాధ్యమైతే మొగుణ్ణి అవలీలగా కొరికి ముక్కలకింద చీల్చేస్తుందా అన్నంత ఉక్రోషంతోను, అసూయతోను, గుడ్లుపెద్దవిచేసి, రొమ్మువిరిచి నిల్చుంది, ఆయనకెదురుగా రామప్రియ!—ఒకదెయ్యంవలె, బ్రహ్మరాక్షసివలె, వెక్కిరింతబొమ్మవలె. బిక్కచచ్చి, వణుకుతూ, కొంతసేపటివరకూ నోట మాటరాక నిశ్చేష్టుడై నిల్చున్నాడు ప్రకాశ్.

మహాచక్కనిది, తెలివైనది, అని మురిసి, గర్వించి, కోరిచేసుకున్న పెళ్లాం యీవిధంగా గదిలో ప్రత్యక్షమైనప్పుడు నిజంగా మతిపోయిందతనికి. మోహినివంటిభార్య పిశాచంవలె కనిపించింది. కోరలుచూపి గుర్రుపెట్టే దెబ్బతినిన చిరుతపులినిచూస్తే ఉండే భీతాహం, పిచ్చికుక్కనుచూస్తే కలిగే రోత, ఆయనలో అప్పుడు ఆకస్మికంగా జనించాయి. రామప్రియనీ, రాధనీ, పోల్చి వితర్కించుకున్నాడు తనలో. కౌగిట్లో ఉన్నరాధ బెదరుపాటుతో విడబడి, మెల్లగా గది విడిచి వెళ్లిపోయింది.

రామప్రియమీద కళ్లెఱ్ఱజేసి ముఖంచిట్లించుకున్నాడు ప్రకాశ్. మాటకుమాట అన్నాడు. ఆమె నేరాలు ఎత్తి యేడిపించాడు.

అస్పష్ట స్వరంతో "నేను నిర్దోషిని" అంటుందామె— సిటికిళతో.

విరసంగా నవ్వి, "ఛీ" అన్నాడు ప్రకాశ్, అసూయతో.

ఆముహూర్తంలో వాళ్ల దాంపత్యస్వర్గం కూలి నరకంలో పడింది. ప్రేమబంధాలు తెగిపోయినవి. ఒకరి కొకరు శత్రువులై అగుపించారు.

* * * * *

ప్రకాశ్ 35 యేళ్ల లోపువాడు. స్ఫురద్రూపి. కాలేజీలో ప్రొఫెసరు. ఐ.సి.యస్. పరీక్షలో ఫెయిలయి, లండన్ డిగ్రీ సంపాదించి, అయ్యవారు వృత్తిలో ప్రవేశించాడు. ఉద్యోగంలో చేరకముందుకూడా మంచిడబ్బుకలవాడే. అతను కాపురమున్న బంగళా, యెక్కితిరిగే కారు, వీటినిపట్టే అతని ధనసంపత్తి కొంతవరకు విశదమౌతుంది. లండన్ నుండి వచ్చిన తరువాత పెళ్లిచేసుకున్నాడు, రామప్రియను. పెళ్లినాటి కామెకు 19వ యేడు. అతనికి 25. ఒకరినొకరు చూసుకొని, వలచుకొని, వరించుకున్నారు. ఏడెనిమిదేళ్లు మహాసౌఖ్యంగా వైభవంగా గడిచిపోయినవి. చిన్నచిన్న ప్రణయ కలహాలు, ప్రథమకోపాలు, ప్రమాదించని మనస్పర్థలు, వీటికిమించి వారి దాంపత్యంలో మరేమీ విపరీతాలు ఒడుదుడుకులు కలగలేదు. ఒకమగబిడ్డ పుట్టిపోయింది. ఆవెనక మళ్లీ ఒకఆడపిల్ల కలిగింది. ఆ శి శు వు నిమిత్తం, దొరలపద్ధతిని, దాది కావలసివచ్చింది. రాధ కుదిరి నాలుగైదు నెలలయింది. అంతకు పూర్వం ఒక ముసలి "ఆయా" ఉండేది. ఇంటి యజమాని తనే అన్నట్లు కనిపిస్తుంది, రాధ, పైవాళ్లకు. తక్కిన నౌకర్లకు, చాకర్లకు, ఆమెనుచూస్తే యెంతో గౌరవం. ఇంచుమించు రామప్రియ

యీడుదే. పాతికేళ్ళుంటాయి. కొన్నాళ్లు ఆసుపత్రినర్సుగా ప ని చే సి, మానేసిన కన్య. పొడుగ్గా, చామనచాయగా, అందంగా ఉంటుంది. కొంచికొంచెం ఇంగ్లీషు మాట్లాడగలదు, ముద్దుముద్దు తప్పులతో. బాగా పాడుతుంది. శుభ్రమైన బట్టలు కడుతుంది, అన్నివేళలా. పువ్వులు, పిన్నులు, పెట్టి జుట్టు బాగా అలంకరించుకుంటుంది. సబ్బులు, సెంట్లు, విరివిగా వాడుతుంది. ఎప్పుడూ చిరునవ్వుతో, సంతోషంగా, నెమ్మదిగా మాట్లాడుతుంది, ఎవరితోనైనా సరే. రామప్రియయెడల చనువుగా ఒకస్నేహితురాలివలె, సోదరివలె ప్రవర్తిస్తుంది. ఇద్దరకీ మంచిపొత్తు. బిడ్డకి తల్లివద్దకంటె, రాధవద్దనే యెక్కువ చేరిక.

రామప్రియ అందకత్తెలలో అందకత్తె. బాగా చదువుకున్న విద్యావతి. వార్తాపత్రికలు, ఇంగ్లీషు పుస్తకాలు, యెన్నో చదువుతూ ఉంటుంది. కొంచెంపొట్టిగా, కుదురుగా, ఒత్తుగా, తెల్లగా ఉంటుంది. పొడుగైన రెప్పలుగల పెద్ద కాటుకకళ్లు. మెట్లుమెట్లుగా, మృదువుగా, నల్లగా తళతళలాడే జుట్టు. కుదురుగా తీరుగా ఉన్న చక్కనిముఖం. నిండా రసం ఉన్న పచ్చిద్రాక్షపళ్లవలె నిగనిగలాడే రంగైన గులాబీ పె ద వు లు. ముద్దులు మూటగట్టే సొగసుందన మామెది. ఎత్తుగా, పొగరుగా, గంభీరభావాలతో సముద్రతరంగాలవలె ఊగే ఆమెవక్షం; యవ్వనమదంచేత కొవ్వెక్కి నిర్లక్ష్యంగా, బలంగా, పెరిగిన తీరైన పిరుదులు; భుజకండరాల మృదుత్వం; చర్మం నునుపు; పాలబిడ్డలవొంటి తళుకును పోలినశరీరం నవ

నవ; కట్టుబట్టల నాజూకు; మాటలమాధుర్యం; నడకలో ఒయ్యారం; చూపులో శృంగారం; అన్నీ దేవతాస్త్రీలకువలె సహజంగా, మనోరంజకంగా, పువ్వునంటిన రంగువలె రమ్యంగా పొడగడతాయి. ఇట్టి అనన్య సామాన్యసుందరి భార్యగా లభించినందుకు ప్రకాశ్ కు సహజంగా గర్వం. ఆమెతో జీవితమొకయింపైన కలవలె గడుస్తూ ఉండేది.

కొద్దిరోజులనుండి రామప్రియకీ భర్తకీ యెందుకో ఒకరిపై ఒకరికి విరక్తి, నిరోత్సాహం పుట్టినవి. కోపంతో, దుఃఖంతో, జెలసీతో, అసూయతో, అర్థంకాని హృదయ వేదనతో, యిద్దరూ బాధపడుతున్నారు. ప్రకాశ్ ప్రేమను రాధ అపహరిస్తూ ఉందేమో అని రామప్రియ ఊహ. రామప్రియ ప్రేమను మీనన్ సంపాదిస్తున్నాడేమోనని ప్రకాశ్ కు అనుమానం.

మీనన్ ప్రకాశ్ కు చిన్ననాటి స్నేహితుడు. బ్రహ్మచారి. కళాశాలలో సహోద్యోగి. ప్రకాశ్ కంటె నాలుగైదేళ్ళు చిన్నవాడు. రూపవంతుడు. కళాభిమాని. చిత్రలేఖనంలో ప్రవీణుడు. కవి. అతని మధ్యపాపిట, ఉంగరాలజుట్టు, ఫ్రెంచిమీసం, నవ్వుముఖంచూసి, రామప్రియ భ్రమిస్తూ ఉందని ప్రకాశ్ కు యీర్ష్య. పరపురుషులతో దనభార్య యెక్కువ చనువుగా సంచరించడం ప్రకాశ్ కు కిట్టదు. కాని యేమీఅనలేడు. వద్దని ఆటంకపరచలేడు. లోలోపల యేదో బాధతో దహించుకొనిపోతున్నాడు. భర్త,

యింట్లో ఉన్నా లేకపోయినా, రామప్రియ మీనాక్షను రానిస్తుంది. ఫలహారాలు మేపుతుంది. అతనితో నవ్వుతూ సంతోషంగా సంభాషిస్తుంది. పయనో వాయిస్తూ, రాధచేత పాడిస్తుంది, అతన్ని సంతోషపరచడానికి. చూసి, ఓర్చుకోలేక పోయేవాడు, ప్రకాశ్.

క్రమక్రమంగా భార్యమీద విముఖత లావైనకొద్దీ, రాధమీద ప్రకాశ్‌కు ఒకవిధమైన అనురాగం అంకురించింది. భార్యకంటె, దాది యెన్నోరెట్లు సుందరంగా కనిపించేది, అతని కళ్లకు. "రాధ తెలివైనది, చక్కనిది. అర్ధంచేసుకొని నన్ను సంతోషపరచడానికి యత్నిస్తుంది. అమూల్యమైన స్నేహితురాలు. నాఅదృష్టంవల్ల దొరికింది!......ఇందులో తప్పేముంది?" అనుకొని ఆత్మను సమాధానపరచుకునేవాడు. తన ప్రవర్తన మంచిది కాదేమోనని అప్పుడప్పుడు శంక కలిగేది. కాని, అ న వ స ర మై న కుశంకలతో చేజిక్కిన ఆనందాన్ని వదులుకోవడం, తె లి వి హీ న మనుకున్నాడు. "రాధకు నామీద యెందుకో ఆప్రేమ! పెళ్లాంగల మొగుడి నని యెరగదూ? ఏంలాభమని నన్నువలచి?...మనసు మళ్లించు కుందుకు పాపం యెంతప్రయిత్నించిందో? సాధ్యం కాలేదు కాబోలు!...ఇంద్రియాలు, నరాలు, ఆత్మ, అన్నీ యెదురు తిరిగి తన స్వాధీనంలోనుండి తప్పిపోయినప్పుడు యెవరైనా యేంచెయ్యగలరు? నాకోసం యెంతత్యాగం చేస్తూవుంది! ఎట్లా కనపరచడం, నాకృతజ్ఞత? దాని నిర్మలప్రేమకు యేమిస్తే ఋణం తీరుతుంది? నరకంలో పడి బాధపడుతూ ఉన్నవాడిని

ప్రేమ రెక్కలతో స్వర్గానికి మోస్తూవుంది!...కాని, ఎట్లా, ఎట్లా, ప్రవర్తించాలి, యిట్టి సందర్భాలలో? ఏం చెయ్యాలి నేను? ఏం చేస్తున్నాను!" అని యేమేమో అనుకునేవాడు.

రామప్రియ యెన్నడూ భర్తను ఖాయిదా పెట్టి యెరగదు. అతని స్వేచ్ఛకు నిర్బంధం కలుగజేయడం నీచ మనుకునేది. తన ప్రవర్తన భర్త శంకిస్తున్నాడని కూడా గ్రహించదు. స్త్రీలు స్వేచ్ఛ ననుభవించడం పురుషులకు మాత్రం అయిష్టమూ అనుకునేది. అదిగాక నలుగురిలో మెసలడం, భర్తతో కలసి మీటింగులకు, క్లబ్బులకు వెళ్లడం రామప్రియకు పరిపాటు. ఒంటరిగా మీనన్‌తో కారుమీద షికారు వెళ్లిందుకు కూడా సంకోచించేది కాదు. బంగళాకు వచ్చిన భర్త స్నేహితులతో బ్రిడ్జి ఆడేది. పొలిటిక్సు చర్చించేది. తనప్రవర్తన భర్తకు నచ్చదేమోనన్న ఆలోచనే లేదు యెన్నడూ. స్వేచ్ఛగా, యిచ్ఛానుసారంగా, హాయిగా వెళ్లబుచ్చేది కాలం.

మీనన్ గొప్ప పెయింటరు. మంచి మంచి బొమ్మలు వ్రాసేవాడు. అస్తమిస్తూవున్న సూర్యకాంతిలో పూపొద రింట పచ్చిక తిన్నెమీద కూచోబెట్టి, రా మ ప్రి య ను చిత్రించాడు, రంగులతో. జీవకళలుట్టిపడే అతని చిత్రలేఖనా నైపుణ్యానికి వెర్రిసంతోషం పొందేదామె. హాలులో తగి లించింది, అతను వ్రాసిన బొమ్మను.

"ఈబొమ్మ చూడండి, ఎంత నేర్పుగా చిత్రించాడో మీనన్!" అంది, భర్తతో మహా ఉత్సాహంగా.

"అవును. మీననొక జీనియస్". అన్నాడు ప్రకాశ్, బొమ్మవేపు చూస్తూ. "కాని విపరీతాభిప్రాయాలు గల తిక్కమనిషి. సౌందర్యమే అతనికి యిష్టదేవత. దేవుడంటే నమ్మడు. దెయ్యమంటే నమ్మడు. ప్రకృతిసౌందర్యం అనుభవించడమే నరుడికి మోక్షమంటాడు. సంఘం, నీతి, ఆచారం, శాస్త్రం, అన్నీ అసందర్భాలంటాడు. షెల్లీవలె స్వేచ్ఛ ప్రేమాభిలాషి. పెళ్లిఅనేది అర్థంలేని అనాగరిక బంధమంటాడు. స్త్రీపురుషులకు జీవమైన సహజప్రేమను పెళ్లిఅనే పేరుగలవిషంపెట్టి, సంఘం చంపేస్తూవుందని ఘోషపెడతాడు. ప్రేమను బ్రతకనివ్వక, ఊపిరాడకుండా పీకనొక్కే బ్రహ్మరాక్షసట, పెళ్లి! మకరందం యేపువ్వులో ఉన్నా, గ్రోలడానికి పాటుపడే తుమ్మెదవలె, మానవుడు ప్రకృతి సౌందర్యం అనుభవించాలంటాడు, మీనన్. మిక్కిలిమంచివాడే, కాని అందంగల ఆడదానిని చూసి ఊరుకోలేడు". అన్నాడు క్రూరంగా నవ్వుతూ.

"అంటే?"

"అంటే అతని సౌందర్యపిపాసకు తృప్తిఅనేదిలేదు— హద్దుమీరి నీతి తప్పితేగాని".

"అన్యాయం మాటలాడకండి అతని అయోగ్యత మీకేం పొడగట్టిందని?" అని యెదిరించింది రామప్రియ.

ఇంతట్లో యెవరో ప్రకాశ్ కొరకు రాబట్టి, ఆ ప్రసంగం అంతటితో ఆగిపోయింది.

ఒకనాడు కనుచీకటివేళ, రామప్రియ, మీనన్ నిల్చున్నారు, ఆమె రూపపటానికి యెదురుగా. దీపాలింకా వెలిగించలేదు హాలులో. బొమ్మవేపు అట్టేచూస్తూ, అతని చాకచక్యాలను హెచ్చుగా పొగిడింది, రామప్రియ. ఒళ్ళు మరచిన ఆనందంతో మాట్లాడుతూవుంది, అతనితో. ఆ క్షీణించే సంజకాంతిలో ఆమె ముఖం మెరుస్తూవుంది, వింతగా.

"ఎందుకు రామం, యీశుష్క ప్రియాలు? పడిన కష్టానికి తగిన కూలైనా లభించనప్పుడు!" అన్నాడు మీనన్, మెల్లగా నవ్వుతూ.

"ఏం బహుమతి కావాలి? అన్నాది, ఓరగాచూస్తూ. ఒకరివేపొకరు నిదానంగా చూసి, నవ్వుకున్నారు. మీనన్ హృదయం పొంగిపోయింది, వెర్రి ఆనందంతో. తటాలున భుజాలమీద చేతులువేసి రామప్రియను గట్టిగా కౌగలించుకున్నాడు. ఆమె పెనగులాడలేదు. ఒళ్ళు తెలియని మోహంతో బుగ్గలమీద ముద్దుపెట్టుకున్నాడు. చైతన్యంలేని బొమ్మవలె నిశ్చేష్టురాలై నిల్చుందామె. వెచ్చగా గుండె కదుముకొని మోహోద్రేకంతో, తాపంతో, తలకుమించిన కోర్కెలతో, చర్మం కంది యెఱ్ఱపడేటట్లుతను బలంగా ముద్దులాడిన ఒక క్షణం వరకూ ఆమెకు మెలకువ రాలేదు. అంతా నిద్రలో

హఠాత్తుగా, అప్పటికప్పుడు జరిగిన వింతకలవలె తోచిం దామెకు. ఒకరి శరీరం ఒకరికి తగిలినప్పుడు వారి రక్తనాడులలో యేదో విద్యుచ్ఛక్తి ప్రసరించింది. అతని ముద్దులలో, ఊపిరిలో, కళ్ల జిగజిగలో, యేదో వేడి, యేదో మత్తు, యేదో వేగిరపాటు పొడగట్టిందామెకు. తన గుండెకాయ చలనం లేక ఆగిపోయినట్లనిపించింది. తల తిరిగింది... వెంటనే స్వప్న మాధుర్యం కరగిపోయింది. మమత వదలి మెలకువ వచ్చింది. సిగ్గువేసి ముఖం ఎఱ్ఱపడింది. అనవసరమైన బలంతో కౌగిలి వదలించుకుంది, అప్పుడు. కోపంతో, దుఃఖంతో, అసూయతో, అవమానంతో, ఆశ్చర్యంతో, ముచ్చెమటలుపోసి గజగజ వణు కుతూ తలవంచి నిల్చుంది, రామప్రియ.

మాటలేక రెండునిమిషాలక్లే నిల్చున్నారిద్దరూ. ఆమె హృదయంలో రేగుతూవున్న తుపాను కనుపెట్టి, తృళ్లిపడ్డాడు మీనన్.

ఏదో చెప్పబోయి, "మీనన్ —" అని ప్రారంభించి ఊరుకుంది. నోట్లో మాటలు నోట్లోనే మణిగిపోయినాయి. దుఃఖం పొంగిపొంగి వచ్చింది. గిరగిర నీళ్ళు తిరిగినవి కళ్లంట. కాని మనోబలంచేత ఆపుకుంది, ఆ ప్రవాహాన్ని.

"మీనన్, ఇట్లా... ఇట్లా... అన్యాయం చేస్తావని అనుకోలేదు. ఇంత తెలివి తక్కువగా ప్రవర్తిస్తావని కలలో నైనా ఊహించలేదెన్నడూ. పవిత్రమైన మనస్నేహాన్ని

మట్టిలోకీడ్చి మలినంచేశావు. నమ్మినందుకా నన్నునీచంగా, కూ్రరంగా, మోసంచేసి పొడిచావు, బల్లెంతో పక్కలో? ఘోరం, అన్యాయం, అసందర్భం, యిది!...ఎట్లా, ఎట్లా దిద్దుకోవడం యీతప్పుని?....అసహ్యం వేస్తూవుంది, నిన్ను చూస్తే!...ఏం చేశావునన్ను? ఎట్లాపోతుందీమచ్చ? యీ బాధ?...ఏం లాభం నీకు, నన్నేడిపించి, మోసగించి, మతిపో గొట్టితే? మళ్లీ నీమొహం యెట్లా చూడగలననుకున్నావు?... ఎందుకిట్లాచేశావు? చిచ్చుబెట్టి చురకపెట్టినావు నాజీవితానికి. హృదయం పొక్కిలెక్కి మండుతూవుంది. బాధపడి యేడుస్తానని యెరగవూ? ఆత్మలేదూ నీకు? దయా, జాలి, ప్రేమ, అనేవిలేవూ నీహృదయంలో? ధీరుడవని పొరపడినాను. కొలువుచేసేపూజారినే బలికోరగల మాయదేవుడవనిగ్రహించలేకపోయినాను...నిన్ననవలసిన పనిలేదు. అగ్నితో చెలగాటంచేసి చెయ్యి కాల్చుకున్నాను....ఇప్పటికైనా నామీద దయ ఉంటే, తక్షణం యిక్కడనుండి వెళ్లిపో—నిన్ను బ్రతిమాలతాను".

ఆమె స్వరంలో వొణుకు, కళ్లలో రౌద్రం, చూసి ఆశ్చర్యపడ్డాడు మీనన్. ఒక్క ముద్దుకెందుకుచెప్మా యింత గడబిడ చేస్తూవుంది, అనుకున్నాడు మొదట. కాని యోచన పైని నిజమైన కారణాం గ్రహించుకున్నాడు. అతని ముద్దుల లోని భావం, ఉద్రేకం, పోల్చుకొని ఆగ్రహిస్తూవుంది. కోర్కెలేని, స్నేహపూర్వకమైన అమాయకపు ముద్దులు కావవి. ఎంతదిట్టమైన మనసునైనా కరగించి, వశపరచుకొని, పాపానికి

ప్రేరేపింపగల విషమచుంబనలవి! పశ్చాత్తాపం కలిగి తల వంచుకున్నాడు. తనమీద తనకే అసహ్యం కలిగిందయెందుకో. వెనక తిరిగి, రెండడుగులు వేశాడు. మళ్లీ యేమాలోచించుకున్నాడో, రామప్రియను సమీపించి, ఆమెవేపు ఒక్కక్షణం నిదానించి చూశాడు. మోకాళ్లమీద పడి చెయ్యి పట్టుకున్నాడు, వొణుకుతున్న వేళ్లతో. దీనంగా గుటకలు మింగుతూ, ముఖం యెత్తి చూశాడు మీదికి, క్షమాభిక్ష యాచిస్తున్నవాడివలె.

రెండు నీటిచుక్కలు రాలేయి అతనిమీద. మనసుకు కొంతశాంతి కలిగింది. నిట్టూర్పువిడిచి, లేచి నిల్చున్నాడు. నిషాచేసిన వాడివలే తూలుతూ బయటికి వెళ్లిపోయినాడు, మళ్లీ ఆమెవేపు చూడకుండా.

సోఫామీద చతికిలపడి, చేతులతో ముఖం కప్పుకొని, యేడ్చింది రామప్రియ, అతడు వెళ్లిపోయిన తరువాత.

హాలువేపు వస్తూ ప్రకాశ్ చూశాడు—రామప్రియ మీద చేతులువేసి, మీనన్ ఆమెను ముద్దులాడడం! నిజమని నమ్మలేకపోయాడు, కొంతసేపటివరకూ. కళ్ళు నులుపుకొని మళ్లీచూశాడు. తేలుకుట్టినట్లు బా ధిం చిం ది, ఆదృశ్యం అతనిని. వెంటనే వెనక్కితిరిగి వెళ్లిపోయాడు, తనగదిలోకి. బీరువాతీసి గ్లాసులో బ్రాంది పోసుకొని తాగేడు. తల బరువెక్కింది. చేతులతో తల అదిమి పట్టుకొని, బల్లవద్ద కొంత

నేపు కదలకుండా కూచున్నాడు, కళ్ళుమూసుకొని. పిమ్మట లేచి, గదిలో యిటూ అటూ పచారుచేశాడు, పిచ్చివాడివలె. టేబిలుమీది బ్రాందీసీసా మళ్లీ అతని దృష్టిని ఆకర్షించింది. మరొకగ్లాసు తాగేడు. గొంతుక కాలింది. కడుపులో వికారం పుట్టింది. కొరకంచుపెట్టి కాల్చినట్లు మండింది, మెదడు. పోయి పడుకున్నాడు మంచంమీద.

రెండుమూడు రోజులవరకూ భార్యవేపు ముఖం యెత్తి చూడలేదు. నౌకర్లమీద మాటకీ చీటికీ కళ్లెర్రచేసి కస్సు మనేవాడు. స్నేహితులతో మాట్లాడేటప్పుడుకూడా మొహం ముడుచుకునే ఉండేవాడు. రామప్రియ నేరస్థురాలనే స్థిర పరుచుకున్నాడు, తనలో. కళ్లారా చూసిన దానికి, యింకా సందేహమెందుకనుకున్నాడు. మీనన్ సంగతి ప్రకాశ్ యెరగడూ? ఆడవాళ్ల నంతలో చనువుచేసుకొని, మంత్రించి, లాలించి, భ్రమింపజేసి, స్వాధీనపరచుకొనుటలో మీనన్ ప్రవీణుడు! నీతిలేని రూపవంతుడు, యువకుడు!...ఎన్నాళ్ల నుండి యీమోసం జరుగుతూ ఉందో?...కాని రామప్రియ వంటి మనోబలంగల మనిషి యిట్లా మీనన్ మాయలకు లొంగిపోవడం ఆశ్చర్యమే! ప్రకాశ్ హృదయం యీర్ష్యతో నిండిపోయింది. మీనన్ మీద చెప్పరాని అసూయకలిగింది. ఒళ్ళు మండింది. భార్యనడిగి యేసంగతీ నిజం తెలుసుకుంటే? కాని ఆమెతో యీప్రసంగం యెత్తడు. మామూలు సంభా షణలో కూడా ముక్తసరిగా మాట్లాడుతున్నాడు.

భర్తలో కలిగిన మార్పు కనిపెట్టింది, రామప్రియ. కాని కారణం తెలుసుకోలేకపోయింది. కాలేజీ వ్యవహారాల గూర్చి మనను కలత పడిందేమో అనుకుంది. స్నేహితులెవరితోనైనా కలహంపెట్టుకున్నాడేమో అనుకుంది. ఒంట్లో చికాకుగా ఉందేమో అనుకుంది. నిజం గ్రహించడానికైనా యత్నించలేదు. నౌకర్లు మూలమూలల చేరి, గుసగుస లాడుకొనేవారు, యిద్దరికీ ఏవో మనస్పర్ధలు పుట్టినవి కాబోలని. బంగళాకు ఎప్పటివలె రావడం లేదు మీనన్. క్రిస్టమస్ సెలవు దినములవి.

ఒకనాడు, ఉదయం, కాఫీ తాగుతున్నప్పుడు వచ్చింది, అతని ప్రసంశ, భార్యాభర్తలకి.

"ఏం చెప్మా, మీనన్ యిప్పుడు బొత్తిగా రావడం లేదు!" అన్నాడు ప్రకాశ్.

"ఏమో!"

"కబురుచేసి కనుక్కుందునా? ఒకవేళ——" అని యేమో అనబోయాడు.

ఇంతట్లో టపావచ్చింది. న్యూస్ పేపర్లు, ఉత్తరాలు తెచ్చి టేబిలుమీద ఉంచింది, రాధ. మీనన్ దస్తూరి కనిపించింది ఒకకవరుమీద, ప్రకాశ్ కు. చప్పునతీసి విప్పినాడు. ఆశ్చర్యంతో చదువుకొని భార్యకిచ్చాడది, "మనకు చెప్పనే లేదే!" అంటూ.

ఉత్తరం చదివి రామప్రియ తెల్లబోయింది. వైద్యాని చూడవలసిన అవసరముండి, హఠాత్తుగా ప్రయాణామైె మీానర్ కలకత్తా వెళ్లినట్లు వ్రాశాడు. పరిపరి విధముల ఆలోచించింది రామప్రియ.

నిదానంగా ఆమె ముఖవైఖరి పరీక్షిస్తూ కూచున్నాడు ప్రకాశ్.

"నాకేమీ అర్థంకాలేదు. మీకూమీకే తెలియాలి". అంటూ ఉత్తరం బల్లమీద పడేశిందామె, అశ్రద్ధగా.

రామప్రియ యెడల జనించిన అనుమానం వలన, ప్రకాశ్ ప్రవర్తన రోజుకు రోజుకు విపరీతంగా పరిణమించింది. త్రాగుడు లావైంది. రాధమీద మోజు యెక్కువైంది. తరుచుగా ఆమెతోనే గడిపేవాడు, తీరుబడి ఉన్న కాలమంతా. రహస్యంగా యేకాంతస్థలాల్లో యిద్దరూ కలుసుకునేవారు. కారుమీద ఆమెను యెక్కడికో తీసుకోపోయేవాడు, పెళ్లానికి తెలియకుండా. రాధ దేనికైనా వశపడుతుందన్న ఆశ కుదుర్చుకున్నాడు. రాధకు బెట్టుసరిలేదు. కపటంలేదు: నీతి విరుద్ధమన్న కించకూడాలేదు. ప్రకాశ్ వంటి పురుషోత్తముడు, ఆమె అందానికి లోబడి ప్రేమబిక్షయాచించినప్పుడు, గర్వంతో హర్షంతో ఆమె హృదయం గంతులాడింది. బిడియం, సంకోచం, లేకుండా అర్పించిందతనికి తన ప్రేమను. "యజమానురాలిపట్ల ద్రోహం చేస్తున్నానే!"

అన్న తలంపే లేదు. కొద్దికాలం ఉండే యౌవనాన్ని లేనిపోని నీతులు పెట్టుకొని, వినియోగించకుండా వృథాపరచే నైజం కాదు, రాధది. జీవితంలో లభించేదే అల్పసౌఖ్యం; అకాస్తా అనుభవించి తీరవలసిందే, అని ఆమె మతం.

సుతిమించి రాగానికి వచ్చేదాకా రామప్రియ కళ్లు తెరవలేదు. మొదట్లో రాధపట్ల విపరీతాభిప్రాయాలేమీ కలగలేదామెకు. భర్తననుమానించి, జాగ్రత్తగా అతని నడ వడి కనిపెట్టే ప్రకృతికాదామెది. స్త్రీ పురుషులిద్దరు కలిసి కూచుంటే చూసి, వాళ్లనుగూర్చి అన్యాయంగా అనుమా నాలు పడే అల్పబుద్ధి కలదికాదామె. బహుశః చెడ్డనడత గలవాళ్లే యితరులలో ఉండే లోపాలు సులువుగా కనిపెట్ట గలరేమో! దూదివలె మెత్తగా, మంచువలె స్వచ్ఛంగా ఉన్న ఆమె విశాల హృదయంలో నీచపు టూహాలకు స్థలమే లేదు. మగడు త్రాగుడు కలవాటుపడుతున్నాడని ఆమె యెరగదు. రాధతో యింత చనువుగా యెందుకున్నాడని ఆలోచించదు. తనలోకమే తనది. ఉష్ట్రపక్షివలె యిసకలో తలదాచుకొని, శత్రుభయం లేదని నిబ్బరపడుతుంది, అమాయకంగా.

మోహన్ ఊరువిడిచి వెళ్లిన కొద్దిరోజులకు, రామప్రియ ఒకటి రెండుసార్లు చూసింది—ప్రకాశ్‌తో రాధ చనువుగా మాట్లాడుతూ నవ్వడం. క్రమంగా అర్థంకాకుండా అయింది వాళ్ల ప్రవర్తన. ఇంట్లో ఆమెదే సర్వాధికారమన్నట్లు

మెసలేది రాధ, ఒకరాణివలె. బిడ్డ సంరక్షణలోకూడా అశ్రద్ధ వహిస్తూవున్నట్లు తోచింది రామప్రియకి. భార్యగదివేపు తొంగి చూడడం మానేశాడు, ప్రకాశ్—రాత్రిళ్లుకూడా. మామూలుకు విరుద్ధమిది! ఏదైనా అర్ధంచేసుకొని ఓర్చుకోగలదు కాని, భర్తనిర్దయను ఓర్చుకోలేకపోయింది, రామప్రియ. వెర్రివెర్రి సమస్యలు చెలరేగాయి మనసులో. గుండెలో యేదో నొప్పిపుట్టినట్లయింది. తీవ్రమైన ఆలోచనలతో మెదడు మండింది. ఆభాధలో కళ్ళువిప్పి, అన్నీ కనిపెట్టి చూసింది. నిర్భయంగా ఒకనాడు భర్తను నిలువదీసిఅడిగింది.

"అబ్బే, లేనిపోని పిచ్చి అనుమానాలు పడకు." అని తేలికగా తప్పుకో బోయినాడు ప్రకాశ్.

ఊరుకోక ప్రశ్నించడం మొదలు పెట్టింది, ఆమె. నిర్దోషివలె ఆగ్రహం నటించి, బొంకి, నచ్చజెప్పి, అప్పటిమట్టుకెలాగో తప్పించుకున్నాడు ప్రకాశ్. కాని, ఆమర్నాడే ప్రమాదవశాత్తూ దొరికిపోయాడు, తప్పించుకుందుకు సాధ్యం కాని స్థితిలో. పట్టపగలు గదిలో సోఫామీద తనూ, దాది, కూచున్నారు, తలుపులు చేరవేసుకొని. అతని తొడమీద కూచొని, మెడచుట్టూ చేతులువేసి, ముద్దులు గురుస్తూవుంది రాధ. ముంగురులు సవరిస్తూ మహాఉద్రేకంతో ముద్దులాడుతున్నాడు ప్రకాశ్. గదిలో వీళ్లున్నారని తెలియక తలుపులు తోసుకొని లోపలికివచ్చింది రామప్రియ. తృళ్లిపడి లేచి నిల్చున్నారిద్దరూ. సిగ్గుతో కౌగలి వదలించుకొని, ముసిముసి

నవ్వు నవ్వుకుంటూ, సోఫావద్ద విడిచిన స్లిప్పర్లు మళ్లీతొడుక్కోకుండానే, మెల్లగా గదివిడిచి వెళ్లిపోయింది రాధ.

భార్యాభర్తలొకరివైపొకరుచూసుకొని, కళ్లకత్తులతో పొడుచుకొని పోట్లాడుకున్నారు. వీరావేశంయెత్తి దెబ్బలాడుకున్నారిద్దరూ. ఒకరినొకరు అనరాని మాటలనుకున్నారు.

"మహా దొడ్డయిల్లాలువలె నోటికివచ్చినట్లు పేలకు! తెలియదనుకున్నావా, పిల్లివలె కళ్లుమూసికొని పాలుతాగితే? నువ్వు, మీనర్ —".

ఏడ్చింది రామప్రియ, తనశీలం రుజువు పరచుకోలేక.

అప్పటినుండి పూర్తిగా విడబడ్డారిద్దరూ. ఒకరితో ఒకరికి మాటలులేవు. ఎవరిగదిలోవాళ్లే. ఒకరిజీవితంలో ఒకరు ఐక్యమై యిన్నాళ్ళూ గడపిన సౌఖ్య దినాలు మరచిపోయినారు. ఒకరిరూపం ఒకరికి అసూయగొలిపింది. ఒక్కయింట్లో, ఒక్కగాలి పీలుస్తూ, మెసలడం దుర్భరంగా తోచింది, యిద్దరికీ. నౌఖరీ వదలుకొని, ఎవరికీ చెప్పకుండా, యింట్లోనుండి వెళ్లిపోయింది రాధ. ఆమెభోగట్టా కనుక్కుందుకు విశ్వప్రయత్నం చేశాడు ప్రకాశ్. లాభంలేక, పిచ్చియెత్తినట్లయిందతనికి.

ఈముచ్చట జరిగిన వారంలోపునే, మీనాక్ష వద్దనుండి పెద్ద ఉత్తరం ఒకటి వచ్చింది ప్రకాశ్ పేర. రెండుసార్లు తనలో చదువుకుంటేనేగాని ప్రకాశ్ కు సంగతులన్నీ విశదపడలేదు. భార్యను నిష్కారణంగా అన్యాయం మాటలాడినందుకు పశ్చాత్తాపం కలిగిందప్పుడు. తన నడవడికలో ఉండిన వక్రత పూర్తిగా గుర్తించి, సిగ్గుపడ్డాడు.

"...క్షేమంగా యిక్కడికి చేరుకోగలిగింది రాధ— ప్రయాణంలో యిబ్బందిపడకుండా. నాఅడ్రసు దానికి తెలును. పూసగుచ్చినట్లు అన్నీ చెప్పింది నాతో. నావద్ద దాపరికంలేదు రాధకి..." అంటూ వ్రాశాడు మీనాక్.

"అయితే నిష్కారణంగా రామంమీద అనుమానపడ్డావా? బలే తెలివైనవాడివిలే! తక్షణంవెళ్లి కాళ్లమీదపడి బ్రతిమాలుకో. సిగ్గులేక నోరెట్లావచ్చింది, ఆమె ననడానికి?... రాధ నిన్ను గమ్మత్తుచేసి ఆడిస్తూఉంటే, కీలుబొమ్మవలె ఒళ్ళు తెలియక ఆడేవన్నమాట! నిన్నేకాదు, లోగడ అనేక మందిని యిట్లానే చేసింది రాధ. ఆసుపత్రిఉద్యోగం ఎందుకు మానుకుందనుకున్నావు? నీలాటి వెర్రికుట్టే ఒకడాక్టరుండబట్టి! దానిప్రకృతి అది. అందరితోనూ సరసాలుచేస్తుంది, ప్రేమోక్తులాడుతుంది. అట్లా భ్రమింపజేసి, మోసంచేసి, యేడిపించడం క్రూరం కాదా అంటే, విరగబడినవ్వుతుంది. సీతాకోక చిలుకవలె ప్రేమరసిమిలో రెక్కలువిప్పి ఆడుకుందుకు సంబరపడుతుంది. నీవంటి తుంటరి పిల్లకాయలు వెరబడించి పట్టుకో

బోతే తుర్రున యెగిరిపోయి నవ్వుకుంటుంది. మళ్లీ పట్టుబడ డానికి సరదాపడుతుంది. ఒక్కొక్కప్పుడీ ఆటలో రెక్కలు నలగ గొట్టుకొని, నొప్పితో బాధపడుతుంది. "తిన్నగా ఖాయి దాపెట్టి కాపాడుకో లేకపోతే, నీకు దక్కనుసుమా, జాగ్రత్త! అనక నన్ను నిష్ఠూరాలాడితే ఒప్పుకోను." అంటుంది నాతో. బలే పెంకెది. రాధకీ, రామానికీ యీవిషయంలో యెక్కడా పొందదు. భిన్నభిన్న అభిప్రాయాలు వాళ్లవి. పురుషులను భ్రమింపజేసి, రంజింప చెయ్యడానికే దేవుడిచ్చిన యౌవన సౌందర్యాల ప్రయోజనమని వాదిస్తుంది రాధ. స్త్రీలను పూజకు తెచ్చుకున్న కోమలపుష్పాలవలె వాసనైనా చూడ కుండా, పురుషులు దూరంనుండే ఆరాధించాలంటుంది రామం! మనలో పొరబాటుంటే, బెదిరించి, యెగతాళిచేసి, నవ్వు కుంటుంది రాధ; చీవాట్లుపెట్టి, క్షమించి, యేడుస్తుంది రామం! పగబూని, శిక్షించడానికి తగిన కాఠిన్యం యిద్దరిలో యెవరి హృదయమందూ లేదు.

"ఒకనాడీమధ్య రామానికి నామీద యెంతోకోపం వచ్చింది. కళ్లకు చంపేశక్తేఉంటే, ఆనాడు నేనవశ్యం చావ వలసిందే! చనువిచ్చింది కదా అని, ఒళ్ళుతెలియక మీద చెయ్యివేసేసరికి, తగిన శాస్తిచేసింది నాకు—మళ్లీ యెన్నడూ అంత తెలివితక్కువగా ప్రవర్తించకుండా. కాని క్షమించింది! స్త్రీలంటే నాకిదివరలో సరదా ఉండేదికాని, యెక్కువ గౌరవం ఉండేదికాదు. ఇప్పుడు నా అభిప్రాయాలు తారుమారు చేశారు, వీళ్లిద్దరూ!......రామానికీ రాధకీ మనం యెంతో

బాకీపడి ఉన్నాం, నిజంగా. కృతజ్ఞత, ప్రేమ చూపి, వాళ్ల గౌరవం సంపాదించుకోవాలి.

"పెళ్లి అంటే నమ్మకంలేని నన్నొప్పించి వశపరచుకుంది రాధ. పూర్వం మాకెట్లాటి వాదనలు జరిగేవని? రోజూ సాయంత్రంవేళ కాలేజీనుండి తిన్నగా బంగాళాకే వచ్చేవాడిని, జ్ఞాపకంలేదూ? తోటలో నేను బొమ్మలు రాసుకుంటూ ఉన్నప్పుడు, తరుచుగా వచ్చేదక్కడికి రాధ, పిల్లని చల్లగాలిలో తిప్పుతూ. నాకాన్వాసు, రంగులు, కుంచెలు, అన్నిటి గూర్చి హాస్యాలు చేస్తూ సరదాగా ముచ్చటించేది నాతో. అనేకసార్లు రహస్యంగా కలుసుకొని, పిచ్చిపిచ్చి ప్రియాలాపాలతో పొద్దుగడిపేవాళ్లం...నువ్వు, రామం, యెన్నడూ కనిపెట్టనేలేదా? చాంతాడంత ఉపోద్ఘాతం ఉంది మాప్రణయ గాధకు...పెళ్లిలేకుండా యిద్దరం దంపతులవలె ఉందామని నాకోర్కె. ఎన్నివిధాలబోధించి, వాదించినా లాభం లేక పోయింది.

"పెళ్లి గిల్లి తలపెట్టకు రాధా! నీస్వాతంత్ర్యం నువ్వు, నాస్వాతంత్ర్యం నేను, పోగొట్టుకోకూడదు. పెళ్లికోసం, ప్రేమకోసం, ఎవరిస్వేచ్ఛను వాళ్ళు వొదులుకోవచ్చునా?" అనేవాడిని.

"మనం ఒకరినొకరు ఖాయిదాపెట్టుకోకపోతే ప్రమాదాలు వస్తవి. కళ్లెం తగిలిస్తేగాని గుఱ్ఱం సవారీకి తర్ఫీదు కాదు!" అనేది నవ్వుతూ.

"హాస్యాలకేంగాని, తప్పులు కూడా చెయ్యడానికి స్వేచ్ఛ ఉన్నప్పుడే కదా, నిజమైన స్వాతంత్ర్యం ఉన్నట్టు? సేఫ్‌గార్డ్స్‌తో నిర్మించుకున్న ప్రేమబంధం దాస్యంకంటె కనికష్టం!'' అని వాదించాను.

"సుఖంలేని స్వేచ్ఛకంటె, హాయినిచ్చే దాస్యమే మేలేమో!'' ఎట్లాగైతేనేం, నన్ను లొంగదీసింది. నాలోటు పాట్లన్నీ అర్థంచేసుకొని, మన్నించింది. వినడానికిఓపికఉంటే, మా ముచ్చట్లు ఎన్నో చెప్తానులే, యీసారి కలుసుకున్నప్పుడు..."

ఉత్తరం పట్టుకొని తిన్నగా రామప్రియను వెదుకు కుంటూ వెళ్ళాడు ప్రకాశ్. గదిలోనే ఉంది, ఉయ్యాలవద్ద నిల్చుని. పిల్లనెత్తుకొని ముద్దులాడుతూ వుంది. త్రుళ్ళిపడి తిరిగి చూసి, భర్తముఖంలో చిరునవ్వు కనిపెట్టి ఆశ్చర్యపడింది.

ఉత్తరం చేతికిస్తూ, ప్రేమతో బిడ్డనందుకున్నాడు, ప్రకాశ్. చదువుకున్నకొద్దీ, రామప్రియ ముఖం వికసించింది సంతోషంతో. చివరదాకా చదివి, పక్కున నవ్వింది.

"ఇద్దర్నీ ఆశీర్వదిస్తూ టెలిగ్రాం యివ్వండి. పెళ్ళి విందు మనయింటనే జరగాలి. తక్షణం బయలుదేరి సాయంత్రం సరికిక్కడికి రమ్మని వ్రాయండి.''

# దాంపత్యము.



ఉదయంనుండి లక్ష్మిమీద ధుమధుమ లాడుతునే ఉన్నాను. చీటికీ, మాటికీ కోపం ముంచుకొస్తూవుంది. కాని బహుశాంతం, ఓర్మి, వహిస్తున్నాను. ఎంతకని సహించగలడు, మనిషన్నవాడు? చీవాట్లు పెడుతున్నాను; తిడుతున్నాను; వెక్కిరిస్తున్నాను; దాన్ని, దానివాళ్లని, అందర్నీ యెత్తి పొడుస్తున్నాను; నన్ను, నాఉద్యోగాన్ని, నాదరిద్రాన్ని, నా స్వభావాన్ని, నన్ను పుట్టించిన దేవుణ్ణి, కసితీరా తిట్టుకుంటు న్నాను. చెయ్యెత్తి చెంపమీద నాలుగుకొట్టి, లక్ష్మికి బుద్ధి చెప్పాలని వుంది; కాని ధైర్యంచాలదు. అదిగాక, లక్ష్మి అంటే నాకు ప్రాణం. దాన్నికొడదామనే తలపు కలిగి నందుకే సిగ్గుగావుంది. కాని,......

మనసుకు శాంతిలేదు. పనిపాట్లయందు శ్రద్ధలేదు. ఏమీతోచదు. ఆఫీసులో పని తెమలకపోవడంచాత, యెన్నడూ నన్ను పల్లెత్తుమాట అనియెరగనిదొర, యెగిరిపడుతున్నాడు. క్లబ్బులోనైనా విశ్రాంతి లభించకుండావుంది. వార్తాపత్రికల లోని విశేషాలేవోచదివి, నాతో ఒకపెద్దమనిషి పోలిటిక్స్ చర్చించబోతాడు. ఏదో పిచ్చిపిచ్చి ప్రశ్నలడుగుతాడు. జబాబు చెప్పకుంటే విసుగుకుంటాడు; చెప్తే అర్థంచేసుకోలేక తెల్లమొహంవేసి చూస్తాడు. బ్రిడ్జిఆటకు కూచునేసరికి, నా

పార్ట్నరు నామీద కారాలు మిరియాలు నూరడం ప్రారంభించాడు.

ఇంటికి వచ్చేరావడంతోనే, పిల్లలు రేచుక్కలవలె మీదపడి, నానాఅల్లరి చేస్తున్నారు; యేడుపులు, నవ్వులు, ఫిరియాదులు, కొట్లాటలు, అసందర్భప్రలాపాలు......బలే చికాకుగా వుంది! ఉయ్యాల్లోవున్న చేతివెధవ నిద్రపోతున్న వాడల్లా లేచి కూర్చుని తేలుకుట్టినట్లు ఒకటే యేడుపు!

"లక్ష్మీ, గ్లాసుతో మంచినీళ్లు తీసుకురా."

ఎంతసేపటికీ లోపలనుండి లక్ష్మి యివతలికిరాదు. మంచినీళ్ళు లేదు. గొంతుక యెండిపోతూవుంది. బూట్సుతో వంటింట్లోకి జొరపడేసరికి, లక్ష్మి యెదురుగా వచ్చి, నావేపు యెగా దిగా చూసి, "ఏంకావాలి?" అని అడుగుతుంది, వొళ్ళు మండుకొచ్చేటట్లు. జబాబుచెప్పకుండా, మడిలోవున్న మంచి నీళ్లబిందె ముట్టుకొని, గ్లాసుతో నీళ్ళుముంచుకున్నాను.

"అది పాలగళాసు. కడగలేదు. మరొకటి తెస్తాను, ఆగండి".

"ఎప్పుడో తెస్తావు. దాహంవలన పీకార్చుకొపోయి, నేను చచ్చినవెనక! గంటసేపటినుంచి అరుస్తున్నాను, నీళ్లో నీళ్లో అని."

"ఈపిల్లలగోలలో నాకు మీమాట వినిపించలేదు. అన్నం వారుస్తూవుండగా, మీజోడుచప్పుడు విన్నాను. వెంటనే చేతులు కడుక్కొని, రానే వస్తున్నాను." అంటూ పంచపాత్రితో నీళ్ళు అందించింది.

"ఇంకా వంటకాలేదూ? అర్ధరాతిరి కావొచ్చింది! ఆకలిచేత నాకు కడుపులో దహించుకుపోతూవుంది."

"ఈవాళ పొద్దు గుంకినది మొదలు పిల్లడు చెయ్యి దిగలేదు. ఉయ్యాల్లోవేసి, రెక్కలుపీకేవరకూ ఊపితే యిప్పుడిప్పుడే కన్నుమూశాడు కాని యీపిల్లలు వాణ్ణి నిదరపోనిస్తారా? ఒకటే అల్లరి-కేకలు-పోట్లాటలు. నేనంటే యెవరికీ భయం లేదుకదా!......మీరు దుస్తులువిప్పి స్నానం చేసే లోపున, వంటఅవుతుంది లెండి".

స్నానంచేసి పెరట్లో చల్లగాలికి వెన్నెల్లో పచారు చేస్తున్నాను. ఒళ్ళు చల్లపడినా, మనసు మండుతునేవుంది, అంతకంతకూ లక్ష్మిమీద కోపం రగులుతునేవుంది.

స్వతహాగా నేను కోపదారిమనిషిని కాను. కోపిష్టినని పరిహాసానికైనా నన్నెవరైనా అంటే సహించుకోలేను. బహు శాంతమూర్తినని, వివేకవంతుడనని, చదువుకున్నవాడినని నాకు గర్వం. ఒక్కలక్ష్మే, నన్నప్పుడప్పుడు దెప్పి పొడుస్తూ వుంటుంది. నాకు కోపంతెప్పించి, "అదిగో, కోపం వొచ్చింది కదూ? మరికోపం, తాపం లేనిమనిషినని బడాయిచెప్పుకోవడ

మెందుకు?" అని పకపక నవ్వుతుంది. లేనితప్పులుకూడా నాలో వెతికి చూపించి నన్ను కేళిచేస్తుంది. "హాస్యానికేమన్నా తప్పుపట్టకూడదు సుమండీ!" అని మళ్లీ బుజ్జగిస్తూవుంటుంది. దానిపెంకెతనానికిహద్దులేదు. ఇంటియజమానినని కాని, తనకు భర్తనని కాని పిసరంత లక్ష్యంలేదు. భయం, భక్తి ఉన్నప్పటికీ, పెంకెతనం, చనువు జాస్తీఅయినాయి. తనకంటె నేను అనేకరెట్లు తెలివైనవాడినని, ప్రవీణుడనని, బలవంతుడనని లక్ష్మికి నమ్మకం తగ్గిపోతూవుందనుకుంటాను. లేకుంటే,...

చదువుకుంటున్న రోజుల్లో నాకుపెళ్ళి, సంసారంఅంటే యెట్లాటి అభిప్రాయాలు ఉండేవని? నాతో సరిసమానమైన యీడు, చదువుగల అందకత్తెను సంపాదించి, పెళ్ళి అనే నిబంధన లేకుండా, ఆమెతో కలసి కాపురం చేస్తూ, స్వర్గానందం అనుభవించగల ననుకునేవాణ్ణి కొన్నాళ్ళు. పురుష జన్మ యెత్తినందుకు సార్థకంగా విధవావివాహం చేసికొని, సంఘసంస్కర్తనని కీర్తిసంపాదించాలనుకునే వాడిని కొన్నాళ్లు. బ్రహ్మసమాజంలో కలసి యేకులంపిల్లనయినా సరే, మనసార వలచి పెండ్లిచేసుకుందామా, అనుకునేవాడిని కొన్నాళ్లు డబ్బులేదు కాని, లేకుంటే లండన్ వెళ్లి, దొరసాన్ని వివాహమాడి వస్తేకదా జన్మసాఫల్యం అనుకునేవాడిని కొన్నాళ్లు. నాఉద్దేశాలు, అభిప్రాయాలు, కోర్కెలు అన్నీ క్రమంగా లోలోపలనే జీర్ణించుకున్నాను. అబ్బో గొంతెమ్మ కోర్కెలు ఎన్నెన్ని ఉండేవని? 'నాకాబోయే భార్య రూపంలో రంభవలె మహా అందమైనదైయుండాలి. చదువు సంధ్యల

లోను, సంగీతంలోను సరస్వతిని మెప్పించాలి. మంచి దేహా రోగ్యం, పెద్దనల్లనిజుట్టు, చెంపకిచారడేసి కళ్ళు, ఆణిముత్యాల వంటి చక్కని పల్వరుస, వినయ ప్రవర్తన, పతిభక్తి—అన్నీ ఉండాలి' అనుకునేవాడిని. కాబట్టి మావాళ్ళు వెతికి వెతికి, కుదుర్చుకొని వచ్చిన సంబంధాలేవీ నాకు నచ్చకపోవడం సహజమే! వాళ్లుచూసేదల్లా యీడు, రూపం, సంప్రదాయం, కట్నం. "పిల్ల అందంగా లే" దని నేనుమూతివిరిస్తే "నీ అందానికి చాలక పోయిందా!" అనబోయి, "సంసార్లకు అందంతో యేం పని?" అనిసమాధానం చెప్పేవాళ్లు "భూమికి జానెడు లేదుకదా, యీఅమ్మాయినా పెళ్లిచేసుకో మంటారు?" అని అడిగితే, "నీచదువు సంధ్య అన్నీ పూర్తి అయేసరికి యెదగక పోతుందా!" అనేవాళ్లు. ఎలాగైతే నేను, నా బి. యే. చదువు పూర్తిఅయేదాకా, వచ్చిన సంబంధమల్లా తప్పించు కున్నాను.

పెళ్ళి చూపులకు లక్ష్మిని చూడడానికి వెళ్ళినప్పుడు దానికి 12 యేండ్లు. మనిషి కొంచెం యేపుగా, బలంగా ఉండేది. అంచాత వాళ్ళఅమ్మ మరో రెండేళ్ళు మీాద వేసింది. "మొన్నటి శ్రావణానికి మాపిల్లకు పదమూడేళ్ళు వెళ్ళి పధ్నాలుగో యేడు వచ్చింది. ఇక ఆపడానికి వీల్లేదు. ఈవైశాఖంలో పెళ్ళిచెయ్యక తీరదు." తెల్లగా, దుబ్బుగా, అందంగా ఉన్నపిల్ల, ముస్తాబుమీాద మరీచక్కగా కనిపించింది నాకళ్లకు.

"మీాఅమ్మాయికి యింగ్లీషు వొచ్చునా?"

"రాదు"

"లేసుకుట్టు చేతనవునా?"

"నేర్చుకోలేదు"

"టెన్నిస్ ఆడగలదా? బైసికిల్ యెక్కుతుందా?" అని కూడా అడగాలని మొదట అనుకున్నాను. కాని, మరి సాహసించలేకపోయినాను. పల్లెటూరిపిల్ల గనుక, నాగరికత తక్కువ అని యేదో సమాధానం చేసుకున్నాను. కాని, తర్ఫీదుచేసి, క్రమంగా లక్ష్మిని దొరసానివలె చెయ్యాలని నిశ్చయించుకున్నాను. రెండుమూడేళ్ళలో నా బి.యే. క్లాసు ఇంగ్లీషంతా దానికి చెప్పేలేనా అనుకున్నాను.

కాపురానికి వచ్చిన ఒక్కయేడాదిపాటు, మహాదీక్షగా చదువుచెప్పేవాడిని, లక్ష్మికి; మొదటయెంతో అడకువతోను, ఆసక్తితోను, ప్రారంభించింది. మంచి చురుకైన తెలివితేటలున్నాయి. కాని, చదువుచెప్పాలని నాకు, నేర్చుకుందామని దానికి, మనసులో యెంతఅభిలాషఉంటే యేంలాభం? పడుచు దాంపత్యం. కొత్తప్రేమ!—చదువు సాగేదెట్లా? కాని, పాపం, నాయిష్టానికి యెన్నడూ వ్యతిరేకంగా నడుచుకుందుకు యత్నించేదికాదు. నవీన నాగరికతకు తర్ఫీదుచేసి, ఆమె రూపానికీ, ప్రవర్తనకీ శోభకూర్చాలనినాసంకల్పం! సబ్బులు, వాసననూనెలు, ఫేస్‌పౌడర్లు, ఊలుదారంకట్టలు, అల్లికపుల్లలు, కొప్పుపిన్నులు, దువ్వెనలు, సన్నబట్టలు—వీటికి బాగా అలవాటు చేశాను. పసుపు, గోమయం, అలుకుగుడ్డ, చీపురుకట్ట

మొదలైనవి తాకనిచ్చే వాడినికాను. ఇంగ్లీషుముక్కలు నాలుగు నేర్చుకుంది. చద్దిఅన్నం తినడం మానేసి, కాఫీ ప్రారంభించింది. మధ్యపాపిట మాని వంకపాపిట తీసేది. సన్నని మల్లిన్‌చీరెలు కట్టేది. జాకెట్లకు లేసు తనేకుట్టుకునేది. ఇంట్లో నడిచినప్పుడు సహితం, మొహామల్ జోడు విడిచేది కాదు. పసుపు, కాటుక మానేసింది. బొట్టుమాత్రం మానిపించ లేకపోయినాను. రోజుకు మూడుసార్లు దంతధావనం చేసేది. ఉదయం, సాయంత్రం సబ్బుతో వొళ్ళు తోముకునేది. గొంతెత్తి, వైదీకంగా అరవకుండా, నెమ్మదిగా ముక్తసరిగా మాటాడేది. మాటికీ చీటికీ, నాతో ప్రణయకలహం రేపి, కోపం నటించి, నన్ను పిచ్చివాడినిచేసి, బ్రతిమాలించుకునేది. ఇరుగు పొరుగు స్త్రీల అనాగరికతకు, రోత, ఆశ్చర్యం జాలి పొందేది. ఇట్లా రోజుకు రోజుకు లక్ష్మిలో నాజూకు అధికం కాజొచ్చినకొద్దీ, నాసంతోషానికి మేరలేకుండా ఉండెను. అంతా నాప్రతాపమే కదా, అని గర్వించేవాడిని. తిక్కమనిషి; వీధిలోకి నాతో షికారురమ్మని యెంత ప్రోత్సహించినా వొచ్చేదికాదు. కాని మొగవాళ్లనిచూస్తే, మోటారు చూసిన పల్లెటూరుగొడ్డువలె బెదరడం మాత్రం ఆమె యెన్నడూ యెరగదు.

మా పెద్దవాడు పుట్టినతరువాత, ఉన్న ఊరునుండి నాకు బదిలీకావడం, ఇంట్లో దక్షత కెవరూ లేకపోవడం, డబ్బుకు కొంచెం యిబ్బంది కలగడం—అన్నీ ఒక్కసారే తటస్థించాయి. ఇల్లు చక్కబెట్టుకోవడం, పిల్లడి సంరక్షణ.

చూడడం, నాకు వేళకు వండిపెట్టడం—వీటితో కాలం సరి పోయేది లక్ష్మికి. పన్నాలు, పిన్నులు, ఊలుదారాలు, ఇంగ్లీషు చదువు అన్నీ మూలపడినవి. క్రమంగా ఆమెరూపంలోను, దేహారోగ్యంలోను కొన్ని మార్పులు కనిపించినవి. పనిపాట్లతో అలసి, శరీరం మోటు తేరింది. తనఅందం, సౌఖ్యం, కాపాడు కుందుకు దానికి శ్రద్ధ తగ్గిపోయింది. మొహంలో కొండె నవ్వు, పెంకెతనం, యౌవనగర్వం, పోయి ఒక విధమైన 'సీరియస్ నెస్' వచ్చింది. నామీద పూర్వంవలె యిప్పుడు ప్రేమ చూపడానికి అట్టే ప్రయత్నించేదికాదు. ఇప్పుడామెకు లోకమంతా అబిడ్డ; తనసౌందర్యం, యౌవనం, నిద్ర, బలం, శుభ్రత, నాగరికత, భర్త—అన్నీ ఆపసికందుకే అర్పించింది. నేను చెప్పరాని యీర్ష్యతో బాధపడేవాడిని.

పిల్లవికి తల్లిపాలు సమృద్ధిగా ఉండేవి. చనుబాలకంటె హార్లిక్సు మంచివని బోధిస్తే కస్సుమనేది. పాలతల్లిని కుదు రుస్తానంటే వొప్పేదికాదు. లక్ష్మికీ నాకూ యీవిషయమై, తరుచుగా యింట్లో యుద్ధం జరుగుతూ వుండేది.

"లక్ష్మి, నీఆరోగ్యం కాపాడుకోవూ?"

"తెలిసీతెలియని పిచ్చిసిద్ధాంతాలు చెప్పక, ఊరు కుందురూ! ఇదేనా యేమిటి, మీ బి.యే. లో చదువుకున్న సయన్సు? బిడ్డకు పాలివ్వకుంటే, ఆతల్లిఉండి యెవరికి ఉపచ రిస్తుంది?"

"దొరసాన్లు చూడూ మరి దాదులు, పాలసీసాలు–"

"వాళ్ళఖర్మం అది."

నవీన నాగరికతా పద్ధతులకు అలవాటు చేయడానికి నేపడిన శ్రమ యావత్తూ బూడిదలో పోసిన పన్నీరైంది. సంసారబాధ్యతలు జాస్తీఅవుతున్నకొలదీ, ఆమెవద్ద శిష్యరికం వహించి, నేనే అనేక సంగతులు నేర్చుకోవలసి వచ్చింది. కడుపున పుట్టిన పిల్లడు బట్టలు మురికిచేస్తే, అసహ్యపడ కూడదు—ఇంటిపనులు చేసుకుందుకు కేవలం నౌకర్లమీద ఆధారపడడం పొరపాటు—లేనిపోని షోకులకు డబ్బు తగల పెట్టడం తప్పు—సమయంవస్తే, విసుగుకోకుండా వంటచేయ వలసిందే కాని, హోటేలుభోజనం పనికిరాదు—ఇట్లాటి ధర్మసూత్రాలు యెన్నో నేర్పబోయేది నాకు.

రెండోపురిటికి ఆడపిల్ల, ఆతరవాత, యీచేతివాడు. ఈముగ్గురుపిల్లలూ నాలక్ష్మీరాజ్యాన్ని పూర్తిగా తమస్వాధీనం చేసుకున్నారు. పిల్లలంటే నాకుపూర్వం ఉండే బులుపిప్పుడు తీరిపోయింది. పెళ్లాం అంటే కొత్తరికంలో నాకుండే ఇంగ్లీషభిప్రాయాలు మారిపోయినాయి. రోమాన్సు చచ్చింది. నాచదువుసంధ్యల ఫలితం—నా ఉద్యోగంయొక్క గౌరవం–ఇప్పుడింట్లో నాపెద్దరికం—అన్నీ ఒక్కమోస్తరుగానే వెలుగుతున్నాయి! చెప్పుకుంటే సిగ్గుచేటు. అన్నివిధాలా దేవుడు నన్ను లొంగదీసి, కాళ్లకూ చేతులకూ సంకెళ్ళువేసి, కసితీర్చు

కుంటున్నాడు. స్వేచ్ఛగా విహారించే పక్షి, పంజరంలో పడి తప్పించుకునే సాధనం కానక, ముక్కు నేలకు రాసుకుంటూ, రెక్కలు టపటప కొట్టుకుంటూ వున్నట్లుంది నాఅవస్థ!

పదేళ్ళకిృందట పెళ్ళిపీటలమీద చూసిన లక్ష్మికీ, యిప్పటిపెంకెలక్ష్మికీ యేమైనా సామ్యంవున్నదా? అప్పుడేమీ యెరగని అమాయికురాలగు పల్లెటూరు పిల్ల; చదువు లోక జ్ఞానం లేని అనాగరికురాలు. నాయిష్టానికి లోబడి నాచేతి కీలుబొమ్మ, నాఆజ్ఞచొప్పున నడుచుకునే ముద్దరాలు. నా మాటంటే వేదవాక్యంగా భావించే విధేయవతి; నాబుద్ధిబలం అంటే యెంతో విశ్వాసంగల పిృయశిష్యురాలు. నన్ను సంతోషపరచడమే తనకు ముఖ్యధర్మమని గట్టినమ్మకంగల సాధుశీల! ఇప్పుడో?......

"లక్ష్మీ......లక్ష్మీ!"

అదిగో, పిలిస్తే వినిపించుకోదు......పిల్లల అల్లరి యింకా అణగినట్లు లేదు. వాళ్ళు తిని పడుకుంటేనేకాని, యింట్లో గాలివాన వెలియదు. ఈవాళయేమో కాని ఆకలి ఉపదృంగా వేస్తూవుంది. ఈవెన్నెల, యీపువ్వుల గాలి, యీచల్లదనం—అన్నీ వొంటిని తాకి, హాయికూర్చ డానికి బదులు మెదడుకు కాక పుట్టిస్తున్నాయి.

లక్ష్మి నన్ను బొత్తిగా నిర్లక్ష్యం చేస్తూవుంది. నా పడుపాట్లూ యేవీ చూడదు. ఇటుపిలిస్తే, అటుపలుకుతుంది.

ఒకటి చెప్తే మరొకటి చేస్తుంది — ‘వండవే పోలీ’ అంటే ‘కుండపట్టుకొని నీళ్ళకు పోతాను’ అన్నట్లు. మీాదు మిక్కిలి యేమైనా అంటే, సణుగుకుంటుంది ‘ఈమొగాళ్ల నైజమే యింతకాబోలు!’ అని. కచేరీవేళకు రెండు మెతుకులు వండిపెట్టడానికి యజ్ఞంచేస్తుంది. చిరిగిపోయిన పాతచొక్కాలు, పంచలు కాస్త కుట్టిపెట్టవే అంటే, “మీాకు లోభత్వం అంతకంతకూ మరీ అధికమవుతూంది. చింకిబట్టలు పెట్లోపెట్టి దాచుకోకపోతే పిల్లడిపక్కకిందికి యిచ్చెయ్యరాదూ?” అని యెదురు తిరుగుతుంది. ‘కాలరుగుండీ కనిపించదేమి?... తాళాలేవీ?’ అని అడిగితే, “పిల్లలు ఆడుకుందుకని తీసి, యెక్కడ పారేశారో!” అని నసుగుతూ చెప్తుంది. ‘ఫౌంటెన్ పెన్‌లో సిరా అయిపోయింది. కొద్దిగాపోసి పెడుదూ’ అంటే, “చేతులోపని వుంది. ఈవాళ్లమట్టుకు నన్ను క్షమించి, మీారేపోసుకోవాలి.” అని చల్లగా చెప్పేస్తుంది. ‘ఆపిల్లడు యెందుకట్లా యేడుస్తాడు? ఏదో సమాధానం చేసి, ఊరుకోపెడుదూ’ అంటే, ‘మూాడు రోజులనుండీ బిస్కట్ డబ్బా ఒకటి తెచ్చిపెట్టమని బ్రతిమాలుతూవుంటే, వినిపించుకోరు గాని,—? ఈవాళ ఆదివారం, సెలవుదినం కదా, కచేరి హడావిడి లేదుకదా, నాకు పనివేళప్పుడైనా పిల్లల్ని కాస్తపిల్చి, ఆడిపించకూడదూ? తప్పా?” అంటుంది. ఎప్పుడూ యింట్లో యిదేనాటకం. ఆఫీసులో నడుం పడిపోయేటట్లు పనిచేసి, అధికార్ల చేత మాటలుపడుతూ, ఆరోగ్యం ఆత్మగౌరవం చంపుకుని, యీాదురోమని కాళ్లీడుచుకుంటూ యిల్లు చేరే పిమ్మటైనా, మనసుకు విశ్రాంతి లేదుకదా?

పదిగంటలు అయింది కాబోలు. గాలి చల్లగా, బలే హాయిగా, వీస్తూంది. రోజూ రాత్రిళ్లు దోమలు చంపేవి— నిద్రపట్టనివ్వక. వెన్నెలకూడా యెందుచేతనో, యీవేళ రమ్యంగా వుంది.

పిల్లలుసుఖంగా మైమరచి నిద్రపోతున్నారు. ఇంకా వంటింట్లో యెంగిళ్లెత్తుకుంటూనో పొయ్యి పేడపెడుతూనో, అవస్త పడుతూవుంది కాబోలులక్ష్మి! నిద్రపోదామంటే కళ్లుమూతలు పడకుండా ఉన్నాయి. ఈవాళ, పాపం, నిష్కారణంగా కోప్పడ్డాను దాన్ని. ఇందాకా, అదీ నేను, భోంచేస్తూవున్నప్పుడు మళ్లీపశ్చాత్తాపం తెచ్చుకొని బుజ్జగించాను; కాని మనసులో యేమనుకుంటూవుందో? నొచ్చుకొని వుంటుంది. నిజమే! పుష్పంలాగ, నెత్తిమీద పెట్టుకోవలసిన మనిషిని, చాకరీలో పెట్టి నలిపేస్తూన్నాను......"ఇంకా మేలుకొనే ఉన్నారూ? ఈసరి కప్పుడే గురుతీస్తూ నిద్రపోతూవుండడం మామూలే?"

పనులన్నీ తీర్చుకొని, పట్టుచీరవిప్పి, చాకింటి చీరె కట్టుకొని, రవికతొడుక్కొని, కాళ్ళుచేతులు, ముఖం సబ్బుతో కడుక్కొని, గదిలోకివచ్చింది లక్ష్మి. టేబిలు మీాది దీపం కొంచెం పెద్దది చేసి తమలపాకులు చీల్చుతూవుంది.

"తాంబూలం వేసుకున్నారా? లేక, మీాకోసంకూడా నాలుగాకులకి సున్నం రాయమన్నారా?"

పరుపుమీద అటునుండి యిటువో త్రిగిల్లి, "'అధి కస్య అధికం ఫలం'—అన్నారు పెద్దలు. మళ్లీ వేసుకుంటాను నీచేత్తో యిస్తే." అని నవ్వుతూ అన్నాను.

మొహంయెత్తి నావేపుచూసింది, చిరునవ్వుతో. గాలి కామెచెంపమీది జుట్టు యెగురుతూవుంది.

"ఆచీల్చినఆకులు చాలునులే......ఇట్లారా!" అని, దగ్గరకిపిల్చి, ముంగురులు సవరిస్తూ, "తలదువ్వకోలేదేం; యీవాళ?" అని ప్రేమతో అడిగాను.

"ఏమీ లేదు".

"నీమూర్ఖత, వైరాగ్యము, ముసిలిచేష్టలు, నాకేమీ అర్థంకాకుండా ఉన్నాయి."

"మీకేవీ అర్థంకావు. మీలోకమే మీది!" అంటూ, ముసిముసినవ్వుతో, "కొంచెం జరగండి...ఆకులు చాలునా?"

"ఇట్లాంటి చక్కని రాత్రివేళ, నువ్వే సంగీతం వొచ్చిన దానివై యుంటే,—"

"నిజమే!.......కాని, దేవుడివ్వనిదానిగూర్చి, లేక పోయిందే, అనికించపడడమెందుకు? నాకు మరిరెండు చేతులు, మరిరెండు కాళ్లు దేవు డిచ్చివుంటే, యెంతో బాగుండును కదా, అనుకుంటూ వుంటాను."

"ఏం చెంకేవు!" అని పక్కున నవ్వి, గట్టిగా వక్షానికి అదుముకున్నాను.

"మీకు కోపం రాదంటే, ఒకటి చెప్పాలని వుంది. వింటారా, శాంతంగా?"

"అంతకంటేనా! చెప్పు."

కొంతసేపేదో ఆలోచిస్తూ ఊరుకుంది.

"చెప్పు మరి." అని ప్రోత్సహించాను.

"అయినదానికీ, కానిదానికీ, యెందుకు నామీద కోపం వొస్తూవుంటుంది మీకు? మళ్లీచదువుకున్నవారు, సర్వం తెలిసినవారు, నాకంటె పెద్దవారు కదా,—? భార్య అనగానే, లోకంలో ఉండే సర్వవిధములైన, సులక్షణాలు, నేర్పరితనం, పనిపాట్లయందు ప్రవీణత, ఆమెలో అంతర్భూతమై ఉంటా యనుకుంటారు కాబోలు మీ మొగాళ్లు! కదూ?......... హితవుగా, కావలసిన పదార్థాలన్నీ చేసి, వేళకు వండి పెట్టాలి. క్లుప్తంగా, పొందికగా, ఖర్చువెచ్చాలు చూసుకొని, సంసారం గడపాలి. సదుపాయంగా, లెక్కకు మించకుండా, కన్ను ముక్కు తీరైనపిల్ల, పాప, కనాలి. వాళ్లని శ్రద్ధగా పెంచి, సుద్దులు బుద్ధులు నేర్పి సంరక్షణ చెయ్యాలి. చుట్టం పక్కం వస్తే, యింట్లో యేదీ వుందనక, లేదనక, గృహస్థు మర్యాదలకు లోటు రాకుండా జరపాలి. నౌకర్లున్నా, లేకపోయినా, యింట్లో అరవచాకరీ చెయ్యాలి. మొగుడి

సనుపాయాలకి వేటికీ లోటు రాకుండా చూడాలి. ఇంట్లో యెవరికైనా రోగాలు రొష్టులు వస్తే, నిద్రాహారాలు మాను కొనైనా ఉపచారాలు చెయ్యాలి. చింకిబట్టలు కుట్టాలి. మురికిబట్టలు ఉతకాలి. ఇళ్లు, వొళ్లు, శుభ్రంగా అందంగా ఉంచుకోవలి. ఎన్నడూ జబ్బు గిబ్బు లేకుండా, ఆరోగ్యంగా బలంగా ఉండాలి. ఫిడేలో, వీణో, వాయించగలిగి హాయి హాయి అనిపించేటట్లు పాడగలిగి ఉండాలి. వార్తాపత్రికలు, అవీ చదివి భర్తతో పొలిటిక్సు చర్చించగల సామర్థ్యం పొంది ఉండాలి—మొత్తంమీద ఆయన అభిప్రాయాలతో యేకీభవిస్తూ! చదరంగం, పేక మొదలైన ఆటలు తెలివిగా ఆడుతూ, భర్తచేత ఓడిపించుకునే జ్ఞానం కలిగి ఉండాలి. నగలకు, బట్టలకు డబ్బుకోసం యెన్నడూ బాధించకుండా పుట్టింటి వాళ్లనే పీడించుకొ తినాలి. అప్సరస్త్రీల అందం, అరుంధతి పాతివ్రత్యం, లక్ష్మీదేవి సౌభాగ్యం అన్నీ ఆమె యందు ప్రతిబింబితమై ఉండేటట్లు చేసుకోవాలి.....ఇన్ని చాకచక్యాలు, గుణాలు ఒక్కరిలో యెట్లా యిముడడానికి సాధ్యమనుకుంటారో? మళ్లీ ఆడదాన్ని 'అబల' అని 'సుకుమారి' అని, 'కోమలి' అని వెక్కిరించే వెధవపేర్లు పెట్టి పిలుస్తారు మీమొగవాళ్లు. శక్తికి మించినభారం దానినెత్తిని మోపి తిన్నగా భరించలేకపోతే శిక్షిస్తామంటారు, మొత్తిపొడుస్తారు, యెగతాళి చేస్తారు—అధికారం ఉంది కనుక! అయితే అజ్ఞానంచేత పురుషుడు యిట్లా ఆచరిస్తున్నాడేమో అనుకుంటుకు

కూడా వీలులేదు. బుద్ధిపూర్వకంగానే చేస్తాడు. కోడిగుడ్డును పొదిగి, ఉష్ట్రపక్షిని పైకి తీస్తానంటాడు. విపరీతం మనిషి.

"సరే 'నాకు చాత కాదు' అని ఆడది కాళ్లు చాచే కూడదా? మహాశక్తి సామర్థ్యాలు ఉన్నదానివలె అన్నిటికీ యెందుకు సిద్ధపడాలి? అని అడుగుతారేమో! ఆడదానికి అభిమానం, పౌరుషం యెక్కువ. చెయ్యలేనిపనినైనా చెయ్యనని చెప్పదు. అహంభావం అనుకోకండి. దాని ఖర్మం అది. ఈతరాని మనిషిని నీట్లో తోసి, "ఈత నేర్చుకో—లేకుంటే చస్తావు" అని చెప్తారు మొగాళ్లు. అంతేకాని, మునిగినా తేలినా, చెయ్యి అందించి కాస్తయినా సహాయం చెయ్యరు.

"సృష్టికర్త స్త్రీని నిర్మించడంలో యెట్టి అభిప్రాయంతో చేశాడు? ఆమె యేయే పనులకు తగి ఉన్నది? ఆమెలో యెట్టి లక్షణాలు ఉండుట సహజము? అని ఆలోచించే బుద్ధిమంతుడు ఒక్కడు లేడు. మొగవాడు తను పెళ్లాడేటప్పుడు ఇంటిపని, వంటపని, చాకిపని, పాకిపని, కుట్టుపని, మట్టిపని, బిడ్డలపని, గొడ్లపని—అన్నిపనులకీ తనభార్య తగివుండి తీరాలను కుంటాడు. న్యాయంపట్టి ఆలోచిస్తే, యిట్టిపనులకు వేటికీ ఆడది పనికేరాదు. దేవుడామె శరీరాన్ని యిట్టి పరిశ్రమల కోసం తయారు చేయలేదు. కాపురానికి వెళ్లే పూర్వం యిట్టిపనులలో ఆమెకు తరిఫీదుకూడా ఉండదు. ఈపనులే నిజంగా మొగవాడు చేయడానికి శ్రద్ధవహిస్తే యెంతో బాగా చేయగలడు. ఒప్పుకుంటారా?"

"సరే. కొన్నికొన్ని పనిపాట్లు, యింట్లో ఆడదాన్ని గొకాయించి చేయించడం తప్పేనని వొప్పుకుంటాను. కాని వంట, కుట్టుపని—ఇట్టి పనులమాట యేం చెప్తావు? పెళ్లాం పిల్లలకి, మొగుడే వండిపెట్టడం సబబని వాదిస్తావా?" అని అడిగాను.

"ముమ్మాటికీని" అని తొణుకుబెణుకు లేకుండా జబాబిచ్చింది.

"చాల్లే! నెలకి మూడురోజులు అవస్థ పడడమే నాకు యజ్ఞం చేసినంత కష్టం అనిపిస్తూ వుంది. ఇక, నిత్యం రెండు పూటలా నన్నే మడికట్టుకోమంటావు కాబోలు? నీపుణ్యం ఉంటుంది సుమీ—" అని నవ్వుతూ బ్రతిమాలడం అభినయించాను.

"లోకం అంటే మన యిద్దరమేనా యేమిటి? న్యాయం యీవిధంగా ఉన్నది కదా అని మనవి చేస్తున్నాను. అంతే కాని, మీ రిప్పుడే వెంగపెట్టుకో నక్కరలేదు."

"అంతేకద?'

"కాని నిజం ఆలోచించండి. వంటలో మొగవాడిని మెప్పించగల ఘనురాల్ని యెన్నడైనా కని, విని యెరుగుదురా? పురాణాల్లోకూడా గొప్ప వంటకత్తె అని, యెవర్నీ మనకవులు వర్ణించినట్లు లేదు. నలపాకం, భీమపాకం అనే

చెప్తారు కాని, ద్రౌపదిపాకం అని వినలేదు. పెళ్లివిందులకూ, సంతర్పణలకూ మొగవాళ్లనే వంటకు కుదర్చడం ఆచారం. హోటేళ్లలోను, సత్రములలోను వంటవాళ్లు మొగవాళ్లే ఉంటారు. శాస్త్రరీత్యా, అనుభవరీత్యా, న్యాయరీత్యా, పురుషపాకమే ప్రసిద్ధమైనప్పటికీ, ఇంట్లో మాత్రం ఆడదే వంట చెయ్యాలంటారు. సాధారణంగా స్త్రీలవి పురుషులను మెప్పించతగ్గ అమృతహస్తాలు కావు—వంటలో, చూతనైనట్లు యేదో మోస్తరుగా చేస్తే సంతోషిస్తారా? మీదుమిక్కిలి చీవాట్లు, ఆక్షేపణలు, పరిహాసాలు, రుసరుసలు!......

"కుట్టుపనిలోనహా మగవాడి కుండే నేర్పరితనం ఆడదానికి లేదు. మీదుస్తులు కుట్టే దర్జీవాళ్లు మొగవాళ్లేకద? ఆడ దర్జీలకోసం పాకులాడడేం? ఇంట్లో మాత్రం పిల్లలబట్టలు, పరికిణీలు, చొక్కాలు, లాగులు, చేతిరుమాళ్లు, రవికలు, పాతగుడ్డలకు అతుకులు, చింకి బట్టలకి మాసికలు, అన్నీ పెళ్లామే కుట్టుకోవాలి?"

"పోనీ, ఇక మీదట, సూది దారం నామీద పడెయ్యి. సహాయం చేస్తాను" అన్నాను పెంకె తనానికి.

"నమ్మకోవలసినదే!" అని తల ఊపుతూ "మొన్న కుట్టుకున్నారుగా, పంట్లాంగుండీలు? సన్నంగా వుందని, ఒక సూది విరిచేశారు. 'దబ్బనంలాటి సూది నానెత్తిని కొట్టావు' అని నన్ను తిట్టి, రెండోసూది వేలుకు గుచ్చుకున్నారు."

"అంటే, కుట్టుపని నాకు చాతకాలే -దన్నమాట విశదమేగా?"

"చాతగాకకాదు; అభ్యాసం లేక. చేసేవాళ్లుండగా, మనం యెందుకు చేసుకోవాలి, అని. కొన్నికొన్ని పనులలో చాతకానట్లు నటించడమే మొగవాడు గొప్పను కుంటాడు. డిగ్నిటీకి లోటురాకూడదుగా, మరి? అన్ని విధాలా, పురుషుడు మహారాజు, సృష్టికర్తకు ముద్దుకొడుకు! ఆడదాన్ని అధోగతికి తెచ్చి, దాన్ని పీడించి పిప్పిచేసి, యిష్టంవొచ్చినట్లు తనసౌఖ్యంకోసం ఉపయోగించుకొని, బానిసను చేసి, దాని మీద సవారీ చెలాయించ గలుగుతున్నాడు. ఆడదాని సహనశక్తికి హద్దు లేకుండా ఉంది. ఎన్నిటికైనా ఓర్చుకుంటా నంటుంది. ఓర్చుకున్నకొద్దీ, ఆమెమీద అత్యాచారాలు చేస్తునే ఉంటాడు మొగవాడని తెలుసుకోదు. అయితే, నాసంగతి, మీసంగతి దృష్టాంతంగా తీసుకొని చెప్తున్నా ననుకోకండి. లోకంతీరుకు వగస్తున్నాను. అంతే కాని—"

ఆమె యిచ్చే ఉపన్యాసం వింటూ, మొహం చూస్తూవుంటే, ఈమె నాలక్ష్మేనా? అనిపిస్తూవుంది. చెయ్యిమీద తల ఆనుకుని, నాగుండెమీదికి కొంచెం వొరిగి, నా మొహంలోకి జిగజిగలాడే ఆమెరుపు కళ్లతో చూస్తూ, ఉద్రేకంతో మాట్లాడుతూ వుంది. ఎదురు చెప్పడానికి యేమీ పాలుపోకుండా ఉంది, నాకు. సూటిగా దాని మొహంవేపు చూడ

డానికే సిగ్గుగా వుంది. ఉదయంనుండి, యెందుకో లక్ష్మిమీద నాకు కోపంగానే ఉండెను. కాని, నిజంగా ఆలోచిస్తే, తగిన కారణం యేదీ కనిపించకుండా వున్నది.

# భద్రాచలక్షేత్రము.

ఈకోవిల, యీఉత్సవాలు, లేకపోతే భద్రాచలంలో నరుడన్నవాడు కనిపించడనుకుంటా! దండకారణ్యం యిది! కోయలు, పెద్దపులులు, పాములు నివసించే మన్యస్థలం. గుట్టలు, పుట్టలు, అడవులు, వాగులు-ఎటుచూసినా యివే! పాడి, పంట-పండు, కాయ-పువ్వులు, చెరువులు, తోటలు-ఏమీలేవు. శీతోష్ణస్థితి వేరే చెప్పనక్కరలేదు. ఉపద్రవమైన యెండలు. ఎడతెరిపిలేనివర్షాలు. ఏఋతువు కాఋతువు ఘోరం అనిపిస్తుంది. కారణాంతరాలచేత రామలక్ష్మణులకి కారణ్యంలో తిరగవలసివచ్చిందట—ఆమహాయిల్లాలు, సీతతో పాటు. ఏంతిని బ్రతికేవారో పాపం? దుంప, ధూళి అయినా దొరకనిప్రదేశం. జంతుమాంసం, యిప్పపువ్వు, కొండజొన్న తిని కాలక్షేపం చేసేవారుకాబోలు—వాగు నీళ్ళు, తాటికల్లు, గొర్రెపాలు తాగుతూ!

భద్రుడి భక్తికీ, ఆతిథ్యానికీ సంతోషించి, రాముడీ కొండమీద వెలిసినట్లు చెప్తారు. కాబట్టే యీఊరుకు భద్రాచలం అనేపేరు వచ్చిందట. దరిమిలాని, రామదాసు ధర్మమా అని యీకోవిల లేచింది. క్రమంగా ఊరు, కోవిల అభివృద్ధి చెందాయి. ఇప్పుడీగ్రామం జనసంఖ్య మూడువేలు. ఉద్యోగస్థులు, వైష్ణవులు, గవర్నమెంటు బంగళాలు, పెంకు

టిళ్ళు, పబ్లిక్ నూతులు, రోడ్డుకిరువాలు, సబ్ కలెక్టరు కచేరి, పోలీసు డెప్యూటీ సూపరిన్‌టెన్‌డెంట్ బంగళా, ఆసుపత్రి, హైస్కూలు, రెండు మూడు సత్రములు, నాటకశాల, ఇప్ప సారా డిస్టిలరీ, క్లబ్బు, కాఫీదుకాణాలు, షాపులు—అనేక విధాలగా ఊరు అభివృద్ధి పొందింది. వర్తకం, వ్యవసాయం, నాగరికత మెల్లమెల్లగా వ్యాపిస్తున్నాయి. పండు, కాయ ఊళ్ళో లేకపోయినా, స్టీమర్లమీద విరివిగా వస్తున్నాయి. పెరుగు, పాలు—గొర్రెవో, మేకవో, యెద్దువో—యేవో సమృద్ధిగా దొరుకుతున్నాయి.

రాజమహేంద్రానికి వందమైళ్ళదూరంలో గోదావరి తీరాన్ని తూర్పుకనుమలమధ్య ఉన్నదీక్షేత్రం. చిన్నఊరు. జమీందారీస్థలం. చిత్రంయేమిటంటే, తాలూకా యావత్తూ బ్రిటిష్ అయినప్పటికీ, కోవిలమాత్రం నైజామువారిది. దాని ఖర్చువెచ్చాలు, మంచిచెడ్డలు అన్నీ నైజాంవారివే. సాలుకు యిరవై వేలు ఖర్చట. హిందూ మహమ్మదీయుల సఖ్యతకు నిజంగా ఈకోవిల ప్రబలమైన నిదర్శనం. మధ్యగా ప్రవహిస్తూవున్న గోదావరి నదికి తూర్పుతీరాన్ని భద్రాచలం, పశ్చిమతీరాన్ని నైజాంరాజ్యం. ఒకప్పుడు భద్రాచలం తాలూకా నైజాం రాజ్యంలోనిదే నట. సుమారు నాలుగు వందలయేళ్ళక్రిందట గోపన్న అనే గోలుకొండ వ్యాపారి నైజాం వారిఉద్యోగంలో తహసీల్దారీచేసినట్లు, అధికార్లను మోస గించి ఆరులక్షలరూపాయలు తిస్కరించి యీకోవిల కట్టినట్లు, దేవుడికి నగలు, భోగాలు, అన్నిసదుపాయాలు ఏర్పాటు

చేసినట్లు, పిదప తానీషావారిచేత కట్టుబడి శిక్షింపబడినట్లు, దేవుడప్పుడు రాజుగారికి కలలో కనబడి రామదాసును కాపాడి నట్లు, నాడు మొదలు తానీషా సంతతివారే యీ కోవిలను పోషిస్తున్నట్లు కథ.

భద్రాచల దేవాలయం చాలా ప్రఖ్యాతిగాంచిన కోవిల. దూర దేశాలనుంచి కూడా యాత్రికులు వస్తూవుంటారు. ప్రతీ యేటా ముక్కోటియేకాదశికి, శ్రీరామనవమికి పెద్దఉత్సవాలు జరుగుతాయిక్కడ. ముఖ్యంగా చైత్రమాసంలో జరిగే కళ్యాణోత్సవం దేశదేశాలకు వినికిరి.

నైజాం రెయిలిప్పుడు కొత్తగూడెం వరకూ ఉన్నది. కొత్తగూడెంస్టేషను పేరే "భద్రాచలంరోడ్డు". తెలియని వాళ్ళు అదే భద్రాచలం అనుకుంటారు. భద్రాచలానికీ ఆస్టేషనుకూ సుమారు పాతిక మైళ్లదూరం. యాత్రికు లీవూరుకు రెయిలుమీద రావచ్చు బెజవాడమీదుగా. లేదా, రాజమండ్రినుండి పడవమీదనో, లాంచి మీదనో రావచ్చు. ఏ దారినివస్తే సదుపాయమని అందరూ అడగడం సహజమే. శరీరదార్ఢ్యం కలవాళ్ళకీ, ఆయుర్దాయం బలంగా ఉన్నవాళ్ళకీ ఉత్సవం రోజులలో రెండుదారులూ ఒకటే. ఈవూరుచేరేలో పునే భద్రాద్రి రాముడు ప్రత్యక్షమౌతాడు—ముఖ్యంగా ముసలివాళ్ళకు, విధవవాళ్ళకును. బెజవాడలో రెయిలెక్కి డోరనకల్ జంక్షనులో దిగి మరోరెయిలెక్కి కొత్తగూడెం రావాలి. అంటే నీరు, నిప్పు, నీడ, చెట్టు యేసౌకర్యం

లేని స్టేషనులో. రైలుదిగగానే పాయీరుజవాన్లు ప్రత్యక్షం. సామాన్లు తణిఖీచేస్తారు. కొత్తబట్టలు, కొత్తవస్తువులు ఏమైనా పెట్టెలలోఉంటే వాటికి కస్టమ్సుడ్యూటీ చెల్లించాలి- రూపాయి విలువైన వస్తువుకు అణాచొప్పున. పెట్లో ఏవీ ఉన్నా, లేకపోయినా యీ హడావిడి మాత్రం తప్పదు— తప్పించుకునేవిధం తెలియనివాళ్లకు. కొత్తగూడెం గ్రామానికీ, రైలుస్టేషనుకూ నాలుగుమైళ్ళ దూరం. ఊళ్ళోకి పోదామనుకున్నా తిన్నగా భద్రాచలమే చేరుకుందామనుకున్నా మోటారుబస్సులే గతి. ఆవకాయలో పిండికూరినట్లు వాటిలో ప్రయాణీకుల్ని కూరుతారు బస్సువాళ్ళు. మనిషిమీద మనిషి. సామాన్లు, సాయిబులు, వెధవముండలు, చంటిపిల్లలు, తగవులాటలు, తోపుడులు, పాటలు—గోల! ఆడ, మొగ, అన్న విచక్షణ పాటించి లాభంలేదు. మోటార్లో చోటుదొరకడమే పదివేలు.

ఇప్పుడిప్పుడు సాఫైన మోటారు రోడ్డొకటి చాలా మట్టుకు తయారైంది. మొన్న మొన్నటిదాకా సరియైన రోడ్డేలేదు. అంతా అడవిదారి. రాళ్ళు, రప్పలు, ముళ్ళకంపలు, గొత్తుపల్లాలు—ప్రయాణంచాలా వొడుదుడుకుగా ఉండేది. మోటార్లు అడుగడుక్కీ ఆగిపోవడం, విరిగిపోవడం, బోల్తా పడడం—నానా అవస్థగానూ ఉండేది. ఊపిరాడక, మోటారుకుదుపుకు చంటిపిల్లలు చచ్చిపోవడం కూడాకద్దు. దారిలో 'కిన్నరసాన' అనే వాగొకటి దాటవలసి వస్తుంది. ఎండకాలం ఆవాగులో నీళ్ళుండవు. ఇంచుమించొక ఫర్లాంగు

న్నర వెడల్పున భగభగమండే యిసక. అయిసకలో మోటారు కదలదు. ప్రయాణీకులు దిగి మోటారు త్రొయ్యాలి. కింద కాళ్ళు కాలడం, మీద నెత్తి మండడం, దాహం, చెమట, యెంత త్రోసినా మోటారు నాలుగడుగులు కదలి మళ్ళీ ఆగి పోవడం—ఇట్లా ఒకగంట అవస్థపడి వాగుదాటాలి. అప్పుడు మళ్ళీ బస్సులో చోటుకోసం దెబ్బలాడుకొని యేమూలో యిరికి, భగవంతుణ్ణి ధ్యానిస్తూ కూచోవాలి. ఈప్రయాణంలో సర్వసాధారణంగా చక్రాల్లో గాలిపోవడమో, యేదైనా విరిగి పోవడమో, యేదో ఒకమరమ్మత్తు వస్తునేవుంటుంది బస్సుకి. రండికీ మొండికీ ఓర్చే శరీరాలైతేగాని యీ ప్రయాణానికి తాళలేవు. ఎలాగైతేనేమి 'బూరుగుంపాడు' చేరుకుంటుంది బస్సు—అంటే భద్రాచలానికి రెండు మూడు మైళ్ళదూరంలో గోదావరికి పడమటివొడ్డున వుండే నైజాం గ్రామంలో. కాని బస్సు అక్కడే ఆగిపోదు. ప్రయాణీకుల సదుపాయార్థం నదీ తీరందాకావచ్చి తాటిచెట్లమధ్య భద్రాచలానికి యెదురు వొడ్డున ఆగుతుంది. తెల్లని యెత్తయిన కోవిల గోపురాలు, చింతచెట్లు, పెంకుటిళ్ళు, తాటాకుపాకలు—భద్రాచలం ఊరు యెదురుగా కనిపిస్తూ వుంటుంది. అందరూ బస్సుదిగి కూలీల నెత్తిని సామానుపెట్టి, గట్టుదిగి యిసకలో రెండు ఫర్లాంగులు నడిచి, కాలిరేవున నదిదాటి, మళ్ళీ యిసకలో రెండు ఫర్లాంగులు నడిచి వొడ్డుచేరాలి.

గట్టెక్కగానే రేవువొడ్డున రెండు చింతచెట్లు, ఒక చిన్న ఆంజనేయాలయం, బైరాగుల మంటపం, సత్రం

కనిపిస్తాయి. ఉత్సవంరోజులలో అయితే ఊరంతో కలకల లాడుతూఉంటుంది. తిండికీ,దాహానికీ యేమైనా దొరుకుతుంది.

రాజమండ్రి నుంచి పడవలమీద ప్రయాణంకూడా కష్టంగానే ఉంటుంది. మోటారు లాంచీమీద మామూలు రోజులలో మూడురోజుల ప్రయాణం. వరదరోజులలోఅయితే అధమం నాలుగురోజులవుతుంది. ఎండకాలంలో నదిలో నీరు తక్కువగా వుంటుంది కనుక స్టీమర్లు నడవవు. నడచినా ఐదారు రోజుల ప్రయాణం. నీట్లో పెద్దపెద్దరాళ్ళు. మధ్యమధ్య నీరు చాలక యిసకలో లాంచి తగులుకోవడం. సాయంత్రంపూట తరుచుగా సుడిగాలి. అనేక ప్రమాదాలు. చైత్రమాసంలో శ్రీరామనవమికని బయలుదేరే పడవల అవస్థ మరీ అన్యాయంగా ఉంటుంది. పదిమందికి సరిపోయే పడివలో యాభై మంది యిరుకుతారు. నదివొడ్డున యెండలో వంటలు, తిళ్ళు; రాత్రి యిసకతిన్నెలమీద పడక; అవసరమైనప్పుడల్లా నీట్లో దిగి పడవతోస్తూవుండడం—వారంరోజులిట్లా అవస్థపడాలి. అయితే యాత్రాభిలాషగల భక్తులకు యీకష్టాలేవీ కనపడవు.

ఐదారేళ్ళనుండి యీస్టీమర్ల సౌకర్యం లభిస్తూవుంది యాత్రికులకు. అందుచేత పూర్వంవలె గాక యిప్పుడేడాది పొడుగుగా వస్తూవుంటారు జనం.

పెరుమాళ్ళ పెళ్ళికిమట్టుకు స్టీమర్లున్నా లేకపోయినా వేలకొలదివస్తారు జనం. ఒకవారం పదిరోజులు ఊరు మహా

అలికిడిగా ఉంటుంది. ఊళ్ళో వాళ్ళకు, వచ్చే వాళ్ళకు, ఉద్యోగస్తులకు, పూజార్లకు అందరికీ హడావిడే! అద్దెలకివ్వడానికని చాలామంది యిళ్ళకు సుద్దో సున్నమో పూసి ముగ్గులు పెట్టి సిద్ధంచేస్తారు. వర్తకులు రాజమండ్రినుండి కొత్తసరుకు విరివిగా తెప్పిస్తారు. ఆపదిరోజులు వ్యాపారం బహు విపులంగా జరుగుతుందనే నమ్మకంకొద్దీ రాజమండ్రి వర్తకులు కొందరు పడవల మీాద సామాన్లు వేసుకొని వారం పదిరోజులు ముందుగానే వచ్చి కూచుంటారు. బజారు కిటకిటలాడుతూ ఉంటుంది దుకాణాలతో. ఇత్తడిసామాన్లు, మాయ వెండిసామాన్లు, పూసల దుకాణాలు, కుంకం కొట్లు, అల్లీదుకాణాలు, కాఫీ హోటేళ్ళు, సోడాషాపులు, లక్కపిడతలు, గాజుబొమ్మలు, ఆటవస్తువులు మొదలైన చిల్లరసామాను దుకాణాలు, ఫాన్సీ గుడ్సు షాపులు—అన్నిరకాల దుకాణాలు బజారుకు రెండు వైపుల పేర్చబడి ఉంటాయి. నాటకసంఘాలు, భాగోతులు, గారడీవాళ్ళు, పీటివాళ్ళు, బిచ్చగాళ్ళు, బైరాగులు యెక్కడెక్కడినుండో వచ్చిపడతారు యాత్రికులను, ఊరివాళ్ళను దోచుకుందుకు.

గవర్నమెంటువారు యేటా యీ కళ్యాణోత్సవానికి కొంతడబ్బు ఖర్చుపెట్టి వచ్చేజనానికి కొంతసదుపాయంచేస్తారు. బసలకోసం గోదావరి వొడ్డున తాటాకుపాకలు వేస్తారు. నదికి వెళ్ళేవాళ్ళ కాళ్ళు కాలకుండా వొడ్డునుండి నీటివరకు పొడుగుగా పందిరి వేస్తారు. బయలు ప్రదేశాలలో చిన్న చిన్న మరుగు దొడ్లు కడతారు. నదివొడ్డున యిసకలో కొళాయిలు పెడతారు.

ఆరోగ్యశాఖవారు నూతులలోను, గోతులలోను మందులు కలుపుతారు రోగాలురాకుండా. పోలీసులు, వాలంటీర్లు, బాయిస్కౌట్లు, ఉద్యోగస్థులు అందరూ యేదో పబ్లిక్ డ్యూటీమీద యిటూఅటూ తిరుగుతునే ఉంటారు. కోవిలలో నైజాంపోలీసు, బ్రిటిష్‌పోలీసు, వాలంటీర్సు మొదలైనవాళ్ళు జనాన్ని ఒకరినొకరు తోసుకొని చావకుండా కాపాడుతూ వుంటారు.

ప్రతియింట్లోను కొత్తజనం—చుట్టాలో, స్నేహితులో, అద్దెకు దిగినవాళ్ళో యెవళ్ళోఒకరు. ఊరంతా ధూళి, దుమ్ము, దుర్వాసన. పాకీవాళ్ళు, హెల్త్ ఉద్యోగస్థులు యెప్పుడు చూచినా పనిచేస్తున్నట్టే కనబడతారు. భజనలు, కేకలు, తగవులాటలు——ఊరంతా కోలాహలం. పగలు పనితోచదు. రాత్రి నిద్రపట్టదు. ఎండ, పొగ, జనసమ్మర్దంకొద్దీ వేడి, చికాకు——ప్రాణం బిజారెత్తిపోతుంది.

ప్రతీయేటా యిదేముచ్చట. దేవుడిపెళ్ళి దగ్గిరకి వొస్తుందీ అంటే యేదో దిగులుగా ఉంటుంది మనసులో. ఎంతమంది చుట్టాలొచ్చి మీదపడతారో అని బెంగ! కలరా, ప్లేగు, మసూచి, యేంరోగాలు పుట్టుకొస్తాయో అని భయం! "కలరా ఇనాక్యులేషను మీయింట్లో అందరికీ చేయించారా అండి? ముందుగానే జాగ్రత్తపడితే మంచిది. కీడెంచి మేలెంచాలంటారు మనవాళ్ళు" అని సలహాయిస్తూవుంటారు మిత్రులు. "హైదరాబాదులో ప్లేగు చాలా భయంకరంగా ఉన్నదట.

అక్కడనుండి వచ్చినవాళ్ళు చెపుతున్నారు" అని మరికొందరు. "ఊళ్ళో ఎక్కడో మసూచకం కేసు ఉన్నదట-విన్నారా?"

ఎన్నిటికని బెంగపడడం? ఏదెలాజరగవలసివుంటే అలా జరుగుతుంది. ఇంతజనంమీద యేరోగంపుట్టినా ఉద్రుతంగానే పరిణమిస్తుంది. మూడేళ్ళకిందట కలరా వొచ్చినప్పుడు ఊరంతా గగ్గోలు పుట్టింది. వచ్చినజనం చెల్లాచెదరై వెళ్ళిపోయారు. కేవలం భయంకొద్దీ చాలామంది చచ్చిపోయినారు. ప్రయాణీకులు తోవలో యెందరో మరణించారట—పడవలలోను, రెయిళ్ళలోను. సగం సగం ప్రాణం ఉంటూవుండగానే కలరా రోగుల్ని వొడ్డునపారేసి పడవలు వెళ్ళిపోయేవట. దహనకర్మలు చేసేవాళ్ళులేక గోదావరిలో తేలిన శవాలకు లెక్కలేదు.

తీర్థానికివచ్చిన జనానికి సరియైన వైద్యసహాయం లభించదు. అందుకుతోడు వాళ్ళు తినే తిండికూడా కలరా వచ్చేటందుకు అనుగుణ్యంగానే ఉంటుంది. ఏచెట్టుకిందనో, గోదావరితీరాన్నో ఉడికీ వుడకని మెతుకులు పచ్చిపులుసుతో తినడం. ఎండలోతిరిగి అడ్డమైన నీళ్ళుతాగడం. కోవిల ప్రసాదమనిచెప్పి కొబ్బరికాయలు, అరటిపళ్ళు, పులిహోర, పొంగలి అన్నీతినడం. రోగంవస్తే కాళ్ళు, చేతులు చల్లపడే వరకూ యెవరికీ చెప్పకపోవడం.

ఇటీవల హెల్త్ డిపార్టుమెంటువాళ్ళు కొంచెం మేలుకొని చిన్న తమాషా చేస్తున్నారు. "భద్రాచలంలో ఉపద్రవమైన

కలరాగా ఉన్నది. తీర్థానికి వెళ్ళదలచే జనం బ్రతుకుమీద ఆశలేకుంటే వెళ్ళవచ్చును'' అని వార్తాపత్రికలలో ప్రకటిస్తున్నారు; చుట్టుపక్కల గ్రామాలలో దండోరా వేయిస్తున్నారు. ఏదోవిధంగా యాత్రికులను హడలుకొట్టి రానివ్వకుండా కొంత వరకు కాపాడుతున్నారు. అప్పటికీ ప్రతీయేటా పదిహేనువేల జనానికి తక్కువకాకుండా వస్తూవుంటారు. నాలుగేళ్ళక్రిందట సామ్రాజ్య పట్టాభిషేకోత్సవానికని నిజంగా యెంతమంది వచ్చారో హద్దూపద్దూలేదు. 'అరవైవేలమంది' అని కొందరు, 'లక్ష చిల్లర' అని కొందరు అంచనావేశారు. ఎక్కడచూసినా కొత్తజనమే. రాత్రిపూట రోడ్లమీదనే పడుకొనేవారు కొందరు, వేరే బసదొరకక. ఆనాలుగురోజులకీ యెంత చిన్న గదికైనా యిరువై ముప్పై రూపాయల అద్దెకు తక్కువ ఉండేదికాదు. ఊళ్ళో వర్తకులవద్ద పప్పు, బియ్యం చెల్లిపోయి కరువు వస్తుందేమో అని భయంవేసేది. ఏయిల్లుచూసినా ముూడోతరగతి రైలుపెట్టెలవలె కిటకిట లాడుతూ ఉండేది. ఆలయంలో అడుగు పెట్టడానికే చోటుండేదికాదు. ఆయేడు దేవుడిదర్శనం చెయ్యగలిగినవాళ్ళు నిజంగా యుద్ధానికి పనికి వచ్చే వీరులన్నమాట.

ఇప్పుడైదారేళ్ళనుండి, శ్రీరామకల్యాణం ఆలయ ప్రాకారంలో జరగడంలేదు; కోవిలకు వెనుకవైపున దగ్గిరగా వున్న ఒకగుట్టమీద కొత్తగా కట్టించబడిన కళ్యాణమంటపంలో జరుగుతూవుంది. నలుగురికీ కనపడేటట్లు తలంబ్రాల వేడుక జరగాలని ప్రజల అభిప్రాయం. సీతారామానుజా

చార్యులనే ఒక ముసలాయన క్రమంగా చందాలు పోగుచేసి యీమంటపం కట్టించడం ప్రారంభించినాడు. బయలుస్థలంలో ఉండే ఆగుట్టమీద క్రమంగా ఒక్కొక్క స్తంభమే లేచింది. పాతికేసి రూపాయలకు తక్కువకాకుండా చందాలిచ్చిన రామ భక్తుల పేర్లన్నీ ఆ స్తంభాలమీద వ్రాయించబడినవి. అయితే "యీమంటపం కట్టడానికి యెంతడబ్బు కావాలి? ఎన్ని స్తంభాలుండాలి? ఏవిధంగా కట్టాలి?" అన్న ఆలోచన ఆచార్యులుగారు పెట్టుకోలేదు. చందాలు వసూలైనకొద్దీ కొత్త స్తంభాలు లేస్తూనే ఉండాలి. ఈపనికి ఆది, అంతం అనేవిలేవు. కావలసినంత గుట్ట ఉన్నది. ఎక్కడ యెంతపొడుగు స్తంభం యేవిధంగా కట్టించినా ఆక్షేపణ ఉండదు. పిండికొద్దీరొట్టె. స్తంభం సగం కట్టి విడిచేసినా యెవరూ యేమీఅనలేరు. డబ్బో? డబ్బు చాలడంలేదు! ఇంతకూ యిది రామకార్యం భక్తుల యథాశక్తికొలదీ మంటపం తయారవుతుంది. "ఇన్ని స్తంభాలేమిటి? అవి యింతలావుగా దగ్గిరదగ్గిరగా వంకర టింకరగా ఉన్నాయేమిటి?" అని అడగడానికి యెవడికి మగుదూరున్నది? రెండేళ్ళక్రిందట యేలూరు వైశ్యులెవరో యీనిర్మాణవైఖరి చూసి యీ స్తంభాలన్నీ పడగొట్టి మంచి అందమైనమంటపం చేతిడబ్బుపెట్టి కట్టిస్తామని వాగ్దానము చేశారట. వారు కట్టించినా మానినా ప్రస్తుతం యీ స్తంభాలైనా కూలద్రోసే పుణ్యాత్ములెవరూ లేరాయెనే అని యెందరో విచారిస్తున్నారు.

గుట్టమీద సదును చెయ్యకుండానే కట్టించినారీ స్తంభాలు. వాటిమీద వెదుళ్ళుపరచి చాపలు కప్పుతారు శ్రీరామ

నవమినాటికి. పట్టపగలు చీకటిగా ఉంటుంది ఆలోపల! ఆ స్తంభాలమధ్య ఒకచివరను ఓచిన్నమంటపం—దానిమీదికి వేంచేయింపిస్తారు స్వామిని. స్వామిచుట్టూ పూజార్లు, ఉద్యోగస్తులు, పోలీసులు మూగి ఉంటారు. మంటపానికి చుట్టూ యీ స్తంభాలమధ్య కిటకిటలాడుతూ జనం. వెలుపల యెండలో నెత్తిమాడుతూ వేలకొద్దీ జనం. గుట్టమీద, రాళ్ళమీద, చెట్లమీద, యెదురుగావున్న కోవిల మెట్లమీద యెక్కడ చూసినా జనం. అందరికీ పాపం కళ్యాణం వేడుక చూడామన్న కుతూహలమే—ఎవరికీ యేమీ కనపడదు! యాత్రకోసమని వచ్చేజనుల ఉత్సాహభంగం, వాళ్ళుపడే శ్రమదమాలు అన్నీచూస్తే జాలివేస్తుంది. మట్టమధ్యాహ్నం పన్నెండుగంటలకి జరుగుతుంది కళ్యాణం—సాధారణంగా. ఎండ మండిపోతూ ఉంటుంది. జనులు ఒకరినొకరు తోసుకుంటూ, కుమ్ముకుంటూ, తిట్టుకుంటూ, సకల బాధలూ పడతారు తలంబ్రాలు పడడం చూడామనే ముచ్చటచాత. చప్పట్లు, కేకలు, పూజార్లమంత్రాలు, బాజాలు, పోలీసు బెత్తం దెబ్బలు, తోపులాటలు—ఇదీ కళ్యాణమహోత్సవం!

"ఎన్ని కష్టాలుపెట్టక, దేవుడు సులువుగా దర్శనమిస్తాడా మరి? భక్తుల్ని పరీక్షచెయ్యడం భగవంతుడికి విలాసం. పాపవిముక్తి అయి, ఎప్పుడా రాముడి దయవస్తుందో అప్పుడేకాని, యీలోపున మనం వెయ్యివిధాల తలక్రిందైతపస్సుచేసినాకాని, దర్శనం లభిస్తుందా?" అని తడిలేని గొంతుకలతో ఒకరినొకరు ఓదార్చుకుంటూ, వేదాంతాలు

మాట్లాడుతూ, ఉత్సవంలో వాళ్లంతా వచ్చుడయేట్లు పోట్లు తిని, నగంచచ్చి, ఉపవాసం బడలికతో కాళ్లీడుచుకుంటూ, యిళ్లకు మరలుతూవున్న వృద్ధవిధవల్ని—పాలకోసం దెయ్యం పట్టినట్లు యేడుస్తూవున్న చంటిపిల్లల్ని రెండేసిచరిచి విధిలేక భుజాల్ని వేసుకొని, దేవుడిదర్శనమైనా తిన్నగా చేయించలేక పోయిన మొగుళ్ల అప్రయోజకత్వానికి చిన్నబుచ్చుకుంటూ, ఉత్సవంలో నిలుచున్న ఆనాలుగు నిముషాలలోనే ముచ్చెమటలు పోసుకొని, ముసిలిరూపు మొహాలతో నడుములు వంచి నడిచే ముత్తైయిదువుల్ని,—పొద్దున్న పొందికగా గంటసేపు దిద్దిపెట్టుకున్న పంగనామాలు యెండలో చెమటకు కరిగిపోయి ఏనుగుశరీరాలవంటి మొయ్యలేని కళేబరాల్ని ఆయాసంతో ఈడ్చుకుంటూ, యెవరినో యెందుకో బొంగురుగొంతుకలతో బండబూతులు తిడుతూ, నడవలేక నడవలేక నడుస్తూవున్న వైశ్యకుబేరుల్ని—చూస్తూ రోడ్డుమీద నిల్చుంటే, ఉత్సవ విశేషాలు తెలియరావడమేకాక, మనసులో యెందుకో జాలి, నవ్వు, కోపం అంకురిస్తాయి.

కళ్యాణోత్సవం ముగిసిన ఉత్తరక్షణమే తిరుగు ప్రయాణానికి మూటలు సర్దుకుంటారు చాలామంది—యాత్ర బులుపు తీరి. మొహం మొత్తుతుందికాబోలు! ఇంతా రానేవచ్చి, నాలుగూ చూడకుండా తొందరపడి వెళ్ళిపోవడమెందుకని, కొందరుమాత్రం రథోత్సవం జరిగేదాకా ఆగుతారు; లేదా బస్సుమీదో, బండిమీదో పర్ణశాలదాకా వెళ్ళి శోకరాముణ్ణి దర్శించివస్తారు: లేదా దగ్గిరలోఉన్న ఉష్ణగుండాలకుపోయి,

అక్కడ వేశినీళ్ళచిత్రించూసి, వస్తారు. ఎక్కడికి వెళ్ళినా, యేది చూసినా, మొదట బయలుదేరేటప్పుడు ఉండేభక్తి, ఉత్సాహం కొంతవరకు క్షీణిస్తాయి. ఎందుకో అసంతృప్తి కలుగుతుంది. ఏవో సందేహాలు పుడతాయి. ఈయాత్రికుల మొహాలు చూస్తే యేదో పరాభవం పొందిన వాళ్ళ మొహాలవలె కనిపిస్తాయి. ఆముదం తాగడానికి అసహ్యించుకుంటూ, తాగేముందే జోకుకుంటూ, గ్లాసు చేత్తోపట్టుకొని సాహసించడానికి సిద్ధపడే ధీరుల మొహాలుంటాయే—ఆ మోస్తరుగా!

భద్రాచల యాత్రంటే, మొదట వెర్రివెర్రి అభిప్రాయాలుంటాయి, చాలామందికి. మహావిపరీతమైన కథలు, కబుర్లు, వింటూ ఉంటారు–ఊహించుకుంటూఉంటారు. తీరా అనుభవించాక పరీక్షిస్తే, ఒకటీరుజువుకిరాదు. వినికిడి కబుర్లకీ, నిజానికీ యెంతో తేడాకనిపిస్తుంది. పడవప్రయాణం బహు చవకనీ, "పాపికొండల" మధ్య చైత్రమాసంలోకూడా సుడిగుండాలుంటాయనీ, భద్రాద్రిరామాలయం తిరుపతిలోవలె యేదో కొండమీద యెత్తుగా ఉంటుందనీ, శ్రీరామ కళ్యాణానికి యేటా హైదరాబాదు నవాబువారు యేనుగుల మీదనో, ఒంటెలమీదనో దోసెడు ముంచిముత్యాలు పంపిస్తారనీ, జగన్నాథంలోవలె పూజార్లిక్కడ దేవుడి ప్రసాదాలు విక్రయిస్తారనీ, ఇక్కడివాళ్ళందరూ రామభక్తులే కాబట్టి చాలాయోగ్యవర్తనులనీ, ఊరునిండా కోతులున్నాయనీ— ఇలాంటి పిచ్చిపిచ్చిఊహాలు చాలాఉంటాయి అనేకమందికి.

ఉన్నత పదవులమీఁద యిక్కడికివచ్చే ఉద్యోగస్తులకీ, దొరలకీ, యీఊరునుగూర్చి యింకా చిత్రమైన అభిప్రాయా లుంటాయి, ప్రథమంలో. మంచిషికారీస్థలమనీ; ఉదయమే తుపాకిచేతపట్టుకొని బయల్దేరితే, ప్రొద్దెక్కేలోపున పెద్దపులిని కొట్టవచ్చుననీ; అడవినిండా వెలగ, ములగ, నేరడి, మామిడి, నిమ్మ, దానిమ్మ, మొదలైన ఫలవృక్షాలుంటాయనీ; మలేరియా ప్రదేశం గనక ఆపళ్ళు, కాయలు యెవరూ ముట్టుకోరనీ; ఈఊళ్ళో అడుగుపెడితే చాలు కొత్తవాళ్ళకు కుదుపుతో చలిజ్వరం వస్తుందనీ; ఇక్కడి దోమలు ఈగలకంటె పెద్దగా ఉంటాయనీ; ఊరునిండా మురికినీళ్ళ చెరువులే అనీ; గోదావరీ తీరం గనక కూరగాయలపాదులు, అరటితోటలు, కొబ్బరి చెట్లు, చెఱుకుగుడ్డాలు, అనేకం ఉంటాయనీ; అనాగరిక ప్రదేశం కాబట్టి అన్నిదినుసులూ కారుచవకనీ, అనుకుంటారు.

న్యాయం ఆలోచిస్తే, మొత్తంమ్మీద యీఊరు వాస యోగ్యమైనదికాదని చెప్పవలసివస్తుంది. ఏజెన్సీస్థలం! ఆరోగ్యం చెడుతుంది. బద్ధకం పెరుగుతుంది. పనిచేసేవాడుకూడా చెయ్యడు, చెయ్యలేడు, చేసినా ప్రయోజనం ఉండదు. ద్వీపాంతరవాసంవలె ఉంటుందిక్కడ. టపాసౌకర్యం, ప్రయాణ సౌకర్యం, తక్కువ. ఇప్పసారా, వంటచెరుకు, గొర్రెపాలు తప్ప, మిగతా అన్నిదినుసులు ప్రియమే. ప్రతీవస్తువు రాజమండ్రినుంచి వస్తేనేకాని, దిక్కులేదుమరి. దినదినగండం బ్రతుకు. తిండికియిబ్బంది. ఇళ్ళకుయిబ్బంది. తేళ్ళభయం, పాములభయం వేరే చెప్పనక్కరలేదు. గోదావరి వరద

రోజులలోను, కళ్యాణోత్సవరోజులలోను, ఊరుకు యెప్పుడైనా ముస్తే! అప్పుడప్పుడు పెద్దపులులు ఊళ్ళోకే వస్తూఉంటాయి, పశువులను యెత్తుకొనిపోవడానికి. ఈఊరి పశువులనుచూస్తే, యేడుపొస్తుంది. బక్క పేగులు, యీడుపుకాళ్ళు, యెండిపోయిన పొదుగులు! పదిగొడ్లను పిండితేగాని శేరుపాలురావు. ఆవొచ్చిన పాలలోనైనా విటమిన్సు ఉండవు. ఊళ్లాతిరిగి, కాగితాలు, యెంగిలాకులు, వావిలాకులు, అడ్డమైనగడ్డీ తిని గోదావరిలో నీళ్ళుతాగి, యీమురోమని యిళ్ళకొస్తాయి, అవి. కుడితి, తవుడు, పొట్టు, తెలకపిండి, వరిగడ్డి, పచ్చగడ్డి, మొదలైనవి రుచికైనా యెన్నడూయెరగవు. యజమాని జొన్నకర్రలు రెండువేస్తే, ఘాటికిపండుగ! ఎండకాలంలో మేతకు అసలు యేమీదొరకదు కాబట్టి, పశువులను అడవికితోలేస్తారు గొల్లలు. వర్షాలుపడి, మళ్ళీగరిక ఆకు మొలిచినపిమ్మట తోలుకొస్తారు—తిండికోసం తిరగడానికి శక్తిలేక చచ్చినవి చావగా, పెద్దపులులు యెత్తుకొనిపోయినవి పోగా మిగిలినవాటిని!

గోదావరీతీరాన్ని ఉన్నదన్నమాటేగాని, యీఊరుకు నీటివసతి యేమీలేదు. చెరువులు లేనేలేవు. కొండప్రదేశం గనుక నూతులు సులువుగా పడవు. తుపాకిమందువేసి రాళ్ళు బ్రద్దలుకొడితేగాని, నుయ్యిత్రవ్వడానికే సాధ్యంకాదు. ప్రతీ యింటికీ యీఊళ్ళో బావి ఉంటుందని అనుకోకూడదు. ఎప్పటికైనా కొళాయిలు ఏర్పాటైతే తప్ప యీఊరుకు నీటిసౌఖ్యం ఉండదు.

ఏపరిస్థితులెట్లాఉన్నా కాని, మంచి అందమైనఊహ, ప్రకృతిశోభ తిలకించగలవాళ్ళకు! వావిలిడొంకలు, జిన్ని మొక్కలు, ఏనుగురంగు రాళ్ళు, ఎత్తైయినగుట్టలు, పాముల పుట్టలు, పవిత్రమైన గౌతమీనది, తెల్లని సదున్నైన యిసుక తిన్నెలు, పేరుపొందినకోవిల, నాగరికతాదోషంలేని అమాయకులగు కోయలు, మ్యూనిసిపల్ కంపులేని స్వచ్ఛమైనగాలి, విశాలమైన సాగులేని పొలాలు, దొంగలభయంలేని నిశ్శబ్దమైన రాత్రులు, రెయిలుపొగ రోడ్డుధూళిలేని నిర్మలమైన నీలిమాకాశం, ప్రేమసూత్రాలు, దైవభక్తి బోధించే తళతళలాడు నక్షత్రాలు—బలేరమ్యమైన ప్రదేశం! సీతారామ వనవిహార స్థలమిది!–మహాఋషుల తపోవాటిక!–పుణ్యభూమి!

# క థ (?)

"అర్ధరాత్రి కావచ్చింది. ఇంకా యేమిటా వ్రాత?... ఇంతకూ, ఎన్నాళ్ళకైన పూర్తిఅవుతుంది గనకనా, అనవల?"

కుర్చీవెనకనిల్చుని, నాభుజంమీదనుంచి వంగి, టేబిలు పైనున్న కాగితాలవైపు చూస్తూవుంది, అకోంటెకళ్ళతో. కలంవిడిచి చిరునవ్వుతో తిరిగేను, ఆమెవైపు. ఎదురుగా వున్న గడియారం గంటలు కొడుతూవుంది. చూస్తే, తొమ్మిది గంటలే అయింది! అర్ధరాత్రికావచ్చిందనే లక్ష్మిని యేమనాలి?

పూర్వం కార్లయిల్ కవి యిట్లానే బల్లదగ్గిర వ్రాసు కుంటూ వున్నప్పుడు భార్యవచ్చి, చెయ్యిపట్టుకులాగేదట— ప్రేమతో. పాపం ఆయిల్లాలి హృదయం తెలుసుకోలేక, ఆయన మూర్ఖంగా తన వ్రాతగొడవలోనే తన్మయుడై ఉండిపోయేవాడట. ఈకథ జ్ఞాపకంవచ్చి, లక్ష్మికి చెప్పేను. ముసి ముసి నవ్వుతో తల తమాషాగా పంకించి, "అవును మరి. 'కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్?' అని చెప్పలేదూ, మీపెద్దనామాత్యుడు?" అన్నాది.

"ఏడిశాడు. లోకానుభవం లేని పోల్లునీతులు పలికే దద్దమ్మ! అబద్ధాలు, దొంగమాటలు చెప్పడం యీ కవులకు పరిపాటయింది.

"కవిత్వమంటే అదేగా?" అని నవ్వుకుంటూ, వయ్యారంగా వెనక్కి తిరిగి వెళ్ళిపోబోయింది.

"ఉండు. వెళ్ళిపోతావేం? ఇట్లా కూచో, యీ కుర్చీ మీద." అని చెయ్యి పట్టుకున్నాను.

"ఎందుకు? నాకు నిద్ర వస్తూవుంది. పోయి పరుంటాను. మిమ్మల్ని పిలవడానికేం రాలేదిప్పుడు-అతగాడి పెళ్లాంవలె." అని నవ్వుతూ, "మీరు వ్రాసుకోండి. ఆపసమూడో ప్రకరణమేనా, ఇంకా?" అంటూ నాబలవంతంమీద కూచుంది, కుర్చీలో.

"నువ్వు ఆక్షేపించే ఆనవలకాదు, నేనిప్పుడు వ్రాస్తూవున్నది."

"మరొక నవల ప్రారంభించారా యేమిటి, కొంప దీసి?" అంటూ విరగబడి నవ్వడం ప్రారంభించింది.

నాఅంత బద్ధకిష్టి భూలోకంలో యెవడూ లేడని ఆమె అభిప్రాయం. లేకుంటే, యీపాటికి నేనొక 'డికెన్సు' నో, 'షా' నో అయివుందుననీ వెర్రినమ్మకం కాబోలు! పుస్తకం ప్రారంభించడంలో ఉండే చురుకుదనం నాకు పూర్తిచేయడంలో లేదని ఎప్పుడూ దెప్పుతూ ఉంటుంది. "లేదు, నవలకాదిది. ఏదైనా ఒకచిన్న కల్పితకథ వ్రాదామా అని కూచున్నాను—పత్రికకోసం—ఏమీ ఊసుపోక" అని సమాధానం చెప్పేను.

"వెనకటికెవడో ఊసుపోని మంగలి పిల్లిని పట్టు కున్నట్లు—"

"అదిగో, నాకవిత్వం, రచనా, ప్రజ్ఞ, అంటే నీకంత వేళాకోళంగా ఉన్నాయికదూ?" అన్నాను, కొంచెం నొచ్చు కొని.

"ఛా, లేదు. మీరు వ్రాసే అబద్ధాలు యెంతో బాగుంటాయి."

"హాస్యాల కెక్కడికిగాని, యీకథవిని నీఅభిప్రాయం చెప్పూ" అని బుజ్జగించేను.

"మంచిశిక్షే నాకు! నేరకపోయివచ్చేను మీగదిలోకి-"
"అయితే వినవూ?"

"వింటాను—కథ సొంతం వ్రాసిన పిమ్మట, సగంలో యేం తెలుస్తాయి, దాని మంచిచెడ్డలు? ఇంతకూ యేకథ వ్రాసినా, మన ప్రతాపాలేగా అందులో వర్ణించేవి?" అన్నాది.

"అనుభవం మీద వ్రాసే విషయాలకూ, కేవలం ఊహాశక్తివలన కల్పించినవాటికీ, యెంతో తేడావుంటుంది, మరి. నిజం రుచించినట్టు అబద్ధం రుచిస్తుందా?" అని సమాధానం చెప్పడం ప్రారంభించేను.

"ఆమాటకొస్తే, నిజంకంటె అబద్ధమే యెక్కువ రుచి! పచ్చికూరకంటె వండినకూర రుచియెక్కువ. మీ రెంతనిజం వ్రాసినా, కొద్దో గొప్పో అబద్ధం మిశ్రమం చేస్తేనే కాని కథ అనిపించుకోదుగద?"

"అష్టవాదన మానవుకదా? అసలు, కథ వినకుండానే యీచర్చ యెందుకు?"

"విన్నతరువాత కథ బాగులేదంటే, మీకు ఆగ్రహం రాదుమరి?"

ఆమాటకు నాకు నిజంగా నవ్వొచ్చింది. కాని సమా ళించుకొని, "కథ చదవమని నన్ను ప్రోత్సహించడానికి బదులు, చదవనియ్యకుండా చేస్తున్నావు. పోనీ, వినడానికి నీకంత యిష్టంలేనప్పుడు బలవంతమూ యేమిటి? వెళ్లిపడుక్కో" అన్నాను.

నాముఖవైఖరి, కంఠంలో కోపం, అన్నీ కనిపెట్టి, బుగ్గలు లొత్తపడుతూ మధురంగా నవ్వి, లేచి నా భుజాలు పట్టుకొని కళ్లళ్లోకి చూస్తూ నిల్చుంది.

సాయంత్రం తలంటుకుందికాబోలు, జుట్టు రేగి కళ్ళ లోను, చెంపలమీద, పడుతూవుంది గాలికి. నవ్వుతూవుంటే, ఆతాంబూలం నోట్లో ఎర్రగా దానిమ్మగింజలవలె కనిపిస్తు న్నాయి పళ్ళు. యాలకుగింజలవాసన గుప్పున కొడుతూ

వుంది, నా మొహంమీద. పెద్దగా వెలుగుతూవున్న టేబిలు లైటు కాంతిలో చెంపలు నిగనిగ మెరుస్తాన్నాయి, అద్దాల వలె. మాధుర్యం, కొండెతనం, చనువు, ప్రేమ- అన్నీ మిశ్రమమై కనిపిస్తున్నాయి, ఆమెచూపులో. పెంకెది లక్ష్మి! నా కంటె పదేళ్ళుచిన్నది. ఇరవై రెండో యేడు కాబోలు. కాని యింకా చిన్నతనం, పెంకెచేష్టలు మానదు. రంగు, పరిమళం, పువ్వును సహజంగా అంటుకొని ఉన్నట్లే పెంకెతనం, శృంగారం లక్ష్మి జీవితంలో ఐక్యమై ఉన్నాయి.

స్కూలువిద్య అట్టేలేదు కాని, పుస్తకజ్ఞానం, లోకానుభవం చాలా సంపాదించింది. వచ్చీరాని యింగ్లీషుముక్కలు, కొత్తగా నేర్చుకుంటూవున్న హిందీభాష, గ్రామఫోనుపాటలు కూనిరాగంతో పాడగలనేర్పు; వెక్కిరింతబొమ్మలు వ్రాయగల చిత్రలేఖనా నైపుణ్యం—ఇవి, ఆమెకుగల యితర విద్యా భూషణాలు. తెలుగు పుస్తకాలు, పత్రికలు, అర్థంచేసుకొని చదువుతుంది. అప్పుడప్పుడు వాటినిగూర్చి నాతో చర్చిస్తుంది- మొండివాదనతో. కొమ్ములు తిరిగిన కవినైనా వెక్కిరించక మానదు.

నేనంటే అసలే లక్ష్యంలేదు. ఏమనుకుంటానో అనైనా సంకోచించదు. నోటికివచ్చినంత మాటా అని తీరుతుంది. నన్ను యెగతాళిచేసి, విసిగించి, కోపం తెప్పించి, బుజ్జగించి, నవ్వుతుంది. "ఏమాటన్నా ఉడుక్కొంటారేం!— ఊరికే తమాషాకి అంటే!" అంటుంది పైపెచ్చు.

"ఆకథయేదో చదవండి మరి, వింటాను." అంటూ కుర్చీలో కూచుంది మళ్ళీ. "ముందే చెప్పండి, కథవిని పొగడాలో, ఖండించాలో! అనక నన్ను నిష్టూరంమాటలనక—"

"చదవను. నువ్వు వినక్కరలేదులే."

"అదిగో, ఎందుకూ ఆకోపం? కవీశ్వరులకు కోపం కూడా అదోకలక్షణం కాబోలు, లేక భూషణమో! చదువుకున్నవారు కనక, చెప్పండి—మీ షేక్స్పియరు, కాళిదాసు, తిక్కన, వీరంతా కోపిష్టివాళ్ళేనా?"

ఏడుస్తున్న వాళ్ళనైనా నవ్వించగల శక్తి ఉంది, లక్ష్మిలో. ముద్దుగా బుజ్జగిస్తుంది.

మెల్లగా నవ్వుతూ "నాకేమీ కోపంలేదు. దా, ఆకుర్చీ కాస్త దగ్గిరగా జరుపుకో. కథ చదువుతాను. శ్రద్ధగా విను మరి—అడ్డప్రశ్నలు వెయ్యక. కాని నీకు సందేహాలుంటే మాత్రం, అవశ్యం అడుగు. చెప్తాను." అని కాగితాలు సరిచూసుకొని, చదవడానికి సిద్ధపడ్డాను.

బుద్ధిగాకూచుని, నావేపు ఓరగాచూస్తూ, "చదవండి చప్పున. ఈలోగా పిల్లవాడు కానిలేస్తే—"అంటూ ఏమో సణిగింది.

"లేస్తే, ఆపిల్ల వుందిగా, దాది?"

"దాన్ని కూచోపెట్టి చదివేస్తారా, తిక్కనకథ?"

"అయితే కథలు వినిపించడానికాయేమిటి, దాదిని కుదుర్చుకోవడం?" అని నవ్వుతూ అడిగినాను.

"కాకపోవచ్చును. కాని, యింట్లో ఆడమనిషి అంటూ ఉన్న తరువాత, యేపనికైనా అక్కఱకు వస్తుంది—మొత్తాని దయితే. పురుషుడు భార్యను పెళ్లాడడం కథలువ్రాసి విని పించడానికా యేమిటి? కాని, నేను కూచుని వినడంలేదూ, బుద్ధిగా?"

చేతపట్టుకున్న కాగితాలు బల్లమీద పడేశాను.

"అదేమిటది? మళ్ళీవచ్చిందా యేమిటి బుస్సు?"

"బుస్సూలేదు గిస్సూలేదు. ఇప్పుడు చదవను కథ. ఇంకా పూర్తికాలేదు. పద—పోయి పరుందాం, హాయిగా" అంటూ లేచి నిల్చున్నాను."

"వ్రాసినంతవరకూ అయినా చదవండి. వినాలని కుతూహలంగా ఉంది, నాకు. నిద్రకూడా తేలిపోయింది. కూచోండి."

"కీలుబొమ్మనిచేసి ఆడిస్తున్నావు నన్ను. నీయిష్టం వచ్చినప్పుడు చదివి, యిష్టంలేనప్పుడు మానేస్తాననుకున్నావా యేమిటి?" అన్నాను.

"చదవరా, యింత బ్రతిమాలుతూ వున్నా?" దీనంగా పెదవుల్లో ముద్దులు తొణికేటట్లు అన్నది, ఆమాట-రెప్పలు పైకెత్తి నావేపు నిదానంగా చూస్తూ. పెద్ద చారడేసికళ్ళు

లక్ష్మివి. మృగాన్నయినా మంత్రించి మచ్చికచేయగలచూపు, అది!...మళ్ళీ కుర్చీలో చతికిలపడ్డాను.

నిజంగా లక్ష్మికి కథలంటే యెంతో సరదా అని నాకు తెలుసు. వొల్లమాలినకథలువచ్చు దానికి. పురాణకథలు, సాంఘికకథలు, హాస్యంకథలు,డిటెక్టివుకథలు, భూతకథలు-యెన్నో చదివింది. ఏఇంగ్లీషుపుస్తకం నేను చదివినా, అందులోవున్న కథ చెప్పేదాకా, ఊరుకోదు. షేక్స్పియరు నాటకకథలు, డీకామెరన్ కథలు, హెప్టామెరాన్ కథలు, అరేబియన్ నైట్స్ కథలు, అన్నీ వరసపెట్టి చెప్పేను. స్ట్రాండ్, నాష్, మొదలయిన మాసపత్రికలలో ఉండే కథలన్నీ చెప్పమని పోరుతుంది. షెర్లాక్ హోమ్స్ కథలంటే కొన్నాళ్ళు చెవికోసుకొనేది. ఠాగోర్ గారి కథలు, లాక్ దొరగారి నవలలు వినిపించిన తరవాత, పోలీసు కథలమీద మోజుతగ్గింది. అదిగాక, వయసు మారుతూవున్నకొద్దీ లక్ష్మికి ఆశయాలలోను, అభిరుచుల లోను, మార్పు వస్తూవుందనుకుంటా. తీక్ష్ణంగా ఆలోచనను రేపగల కథలు కావాలంటుంది.

"లక్ష్మీ! కథచదివి వినిపిస్తానుకాని, ముందు నువ్వొక షరతుకు వొప్పుకోవాలి." అన్నాను చిరునవ్వుతో.

"నాకు తెలుసు, ఆషరతు. అందుకు వొప్పుకుంటే, కథవినిన ఆనందమే ఉండదు నాకు. కథ సాంతం వినకుండా విమర్శించకూడదంటారు—మధ్య మధ్య ప్రశ్నలడగకూడదంటారు— కొయ్యబొమ్మవలె నోరుకట్టుకొని కూచోమంటారు!"

"అబ్బే, అల్లాటి అన్యాయంపరతుకాదు. నీయిష్టం వచ్చినట్లు చర్చించవచ్చు. ప్రశ్నలడగవచ్చు. వెక్కిరించ వచ్చుకూడా. మధ్య మధ్య నీప్రశ్నలు, సందేహాలు, ఆక్షేప ణలు—ఇవిలేకపోతే సాగుసేలేదు." అని అభయంయిచ్చేను.

"అయితే మరేమిటాపరతు?" అని అడిగింది, ఆశ్చ ర్యంతో బొమలుపైకెత్తి.

"ఏమీలేదు. బాగాఆలోచించి, నువ్వే యీకథకు నామకరణం చెయ్యాలి." "అంటే?"

"అంటే, యేపేరుపెడితే బాగుంటుందో చెప్పాలి. సరియైనపేరు నాకేదీ తోచలేదు. నీసహాయం కావాలి."అని చెప్పేను.

"ఓ, ఆలాగే! నన్నుకూడ కవిత్వంలో తర్ఫీదుచెయ్యా లని సంకల్పమాయేమిటి?...తాచెడ్డకోతి వనమంతా చెర చిందట!" అన్నాది నవ్వుతూ.

"కవిత్వధోరణి నీలో స్వతహాగాఉంది. నాబోటి లేని వాళ్ళు కృషిచేసుకోవాలి. నీకు నేను నేర్పనక్కరలేదు. ఆమాట కొస్తే, నువ్వేనాకు నేర్పగలవు." అని కాస్త పొంగవేశాను.

"పోనీ, మీారన్నమాటే వాస్తవమైతే, నన్ను గురు వుగా పెట్టుకోరాదూ?" అన్నాది, పెంకెగా చూస్తూ.

"బెత్తం దెబ్బలకు భయం!" అన్నాను హాస్యానికి.

"ఔత్యంకూడా యెందుకు? శాస్త్రంలో మాకుఆయుధం నిర్ణయించబడే ఉన్నది." అంటూ తన పొడుగైన త్రాచువంటి జడపట్టుకొని వయ్యారంగా బెదిరించింది.

లక్ష్మి సొగసరి. అందంకలదని కించిత్ గర్వంకూడా!.

"జడతో నేర్పవలసిన పాఠాలువేరు! వాటికోసం శిష్యరికం చెయ్యడం నాకు ముచ్చటే." అన్నాను సరసంగా.

సిగ్గుతో తలవంచి, ముసిముసినవ్వు నవ్వుకుంది. క్షణం ఊరుకొని, "కథచదవండి" అని ప్రోత్సహించింది.

కిటికీలోనుండి చల్లనిగాలి వీస్తూవుంది, శ్రావణమాసపు నీటిగాలి. దాదాపు పదిగంటలరాత్రి కావచ్చింది. లక్ష్మి కట్టినచీరె అందం, ఆమెతొడిగిన రవికరంగు, అట్టే పరిశీలిస్తూ కూచున్నాను, పరిపరివిధాల ఆలోచిస్తూ.

చిత్రమైన మనిషి, లక్ష్మి! క్షణంక్రిందట కథచదువుతానంటే, మొర్రో వద్దని ఘోషపెట్టింది. ఇప్పుడు చదవమని నిలవదీస్తూవుంది. నిజంగా కథ వినాలని కుతూహలమో, లేక నన్ను వెర్రికుట్టనిచేదామని సంకల్పమో? భర్త చిన్నవాడనీ, చదువుకున్నవాడనీ, సరస్వతీ కటాక్షంవల్ల కవిత్వం చెప్పగల శక్తివంతుడనీ, సంతోషించి గర్వించే అమాయకురాలుకాదు లక్ష్మి. నా ఇంగ్లీషువిద్యని తృణీకరిస్తుంది. పద్యాలు వ్రాయడానికి కూచుని, యతిప్రాసలకోసం నేను పడే ఆవేదనచూసి, జాలిగాపెడుతుంది ముఖం. "ఆరునెలలు సాముచేసి, మూలనున్న ముసలిదాన్ని మెదిరించాడట,

వెనకటికో యోధుడు! అట్లావుంది, మీకవిత్వపటిమ! బియ్యేలు, ఎమ్మేలు చదువుకున్నామని ప్రగల్భాలు—తుదకా విద్యా ప్రభావం యీరీతిగా పరిణమిస్తూవుంది. వ్రాసేదొక గీత పద్యం, లేకుంటే పిట్టకథ. అదైనా పోనీ, అర్థం తాత్పర్యం ఉన్నదైతే యేమో అనుకోవచ్చు" అని వెక్కిరిస్తుంది.

"భావకవిత్వమంటే మరేమిటనుకున్నావు?" అని యేదో సమాధానం చెప్పబోయాను, లోగడ.

"చాల్చాలు, ఊరుకోండి. వెర్రి మొర్రి గీతాలు వ్రాసి భావకవిత్వమనడం, ఉచ్చం నీచంలేని పిచ్చి కథలు వ్రాసి ప్రోబ్లెమ్‌స్టోరీస్ అనడం—ఇదేగా మీసవ్యాయిషి?" అని యెదురు తిరిగింది.

లక్ష్మి ధాటికి ఆగలేక, యీమధ్య పద్యాలు వ్రాయడం బొత్తిగా మానుకున్నాను. చిన్నచిన్నకథలు, నవలలు వ్రాయడానికికూడా జంకుగానే ఉంది.

స్వతంత్ర గ్రంథాలే వ్రాయాలంటుంది. తర్జుమాలు, అనుకరణాలు, దాస్యబుద్ధిని నిరూపిస్తాయంటుంది. 'చిత్రం చిత్రం మహాచిత్రం' అన్నట్టుండాలట కథలు. అంతేకాని, పాడినపాటేపాడు దాసరీ అని, పాతపడిన తొక్కువిషయాలు మళ్ళీ మళ్ళీ వ్రాస్తే, యేం ప్రయోజనమని అడుగుతుంది. కథనూతనంగా ఉండాలట, వ్రాత నూతనంగావుండాలట, ఆశ్చర్యం, సంతోషం కలుగుతూఉండాలట, చదువుతూఉంటే ఫలానాకథమోస్తరని చెప్పడానికివీలులేకుండా ఉండాలట. అప్పుడు కాని రక్తి కట్టదట, కథ. అన్నీ హిరణ్యాక్షవరాలు, దానివి.

పురాణకథలు వ్రాస్తే, "యెంగిలికూడే కాని రుచించదా మీకు?" అని అడుగుతుంది. సాంఘిక కథలు వ్రాస్తే, "ఎంత సేపూ దేశభక్తి, పాతివ్రత్యం, విధవావివాహాలు, తోటి కోడళ్ళతగవులు—ఇవేగా? తలనొప్పి!" అంటుంది. డిటెక్టివ్ కథలువ్రాస్తే, "దొంగతనాలు, హత్యలు, విషం, రక్తం, కత్తులు, తుపాకులు, పోలీసులు—చదివేవాళ్ళకు పాడుకలలు వచ్చి, ఆరోగ్యం చెడి, రోతపుడుతుంది" అని చెప్తుంది. ఇక ప్రకృతిశాస్త్రం, మానసికశాస్త్రం, నిరూపించేకథలు వ్రాస్తే, "స్వర్గానికి వెళ్ళినా సవతిపోరు తప్పదన్నట్లు, కథల్లోకూడా యీశాస్త్ర చర్చ యెందుకు?" అని చికాకుపడుతుంది.

"నీకు నచ్చినకథ వ్రాస్తే ప్రయోజకత్వమున్నా, లేకుంటే చేతకానితనమూనా?" అన్నాను, ఒకమాటెప్పుడో.

"విద్యాజ్ఞానము, విమర్శనాశక్తి లేని నాబోటి ఆడ దానికే మీపుస్తకం రుచించనప్పుడు, లోకానికేం రుచిస్తుంది? ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికెగిరిందట!" అని మెత్తిపొడిచింది.

అంచేత, యేదైనా కథవ్రాయడానికి నిశ్చయించి నప్పుడు, ముందుగానే లక్ష్మితో కలబోసుకోవడం నాకు పరిపాటయింది. ఆమెతో చర్చించినపిమ్మట, ఒక్కొక్కప్పుడు చేసుకున్న ప్లాటు తల్లక్రిందుగా మారిపోవడంకూడా కద్దు. మొండివాదనైనా, లక్ష్మిది సూక్ష్మబుద్ధి. నిజం కనిపెట్టి నిర్మొగమాటంగా చెప్తుంది. తిక్క తిరిగి శ్లాఘించడానికి ప్రారంభించినా, అంతే. భుజాలుపొంగేటట్లు పొగడి, ఆకా శాని కెత్తేస్తుంది. తెలుగు పుస్తకాలలో అప్పారావుగారి

"కన్యాశుల్కం" వంటి ఆదర్శ గ్రంథం మరొకటిలేదని వాదించింది, నాతో అనేకసార్లు. ఆమాత్రంగా వ్రాయడానికి ప్రతివాడికీ చేతవుతుందా, మరి?

నవ్వుకథలంటే బలే సరదా లక్ష్మికి. హాస్యరసం వ్రాయలేని కవిని శుంఠగా భావిస్తుంది—అతగాడెంత ఉద్దండపండితుడైనాసరే. అయితే విషాదాంత కావ్యాలలోను, యేడుపు కథలలోను, ఉండే స్వారస్యం గ్రహించలేదనికాదు. "ఒథెల్లో" నాటకం చాలా గొప్పదని పొగడుతుంది. ద్విజేంద్రలాల్ రాయిగారి "షాజహాన్" నాటకం హిందీలో చదివి, "మీ షేక్స్పియర్ వ్రాసిన 'లియర్' నాటకం కంటె, యెన్నోరెట్లు బాగుంది, యిది" అని అభిప్రాయం యిచ్చింది.

మొత్తంమ్మీదని యేకథ చదివినా, అందులో ఉండే లోపాలే ముస్ముందు కనిపిస్తాయి, లక్ష్మికళ్ళకి. ముఖ్యంగా నేను వ్రాసిన కథలైతే, బూరెల్లో పురుగులెంచినట్లు, వాట్లో వుండే లోటుబాట్లను వెతికివెతికి పైకితీస్తుంది. చిన్నకథైతే, యెందుకీ బాలకవిత్వమంటుంది. పెద్దకథైతే చేంతాడులాగు చదివినకొలదీ పెరుగుతూవుండేమని చికాకుపడుతుంది. కథలో నాయకిని రూపవతిగా వర్ణిస్తే, "అవును, నాయకి అన్నది అందంగా ఉండకపోతే కథనడవదు. మీపెద్దకవులెవరూ కురూపినాయకిల్ని గూర్చి వ్రాయలేదుగా!" అని యెగతాళి చేస్తుంది. నాయకిని సామాన్యంగా చిత్రిస్తే, "కథలోకూడా ఆడదాన్ని అసహ్యపరచాలీ? మాటవరసకైనా స్త్రీని గౌరవించ

కూడదు కాబోలు! మీ మొగవాళ్ళకంటికి, ఆమెలో ఉండే లోపాలే ముమ్మొందు గోచరిస్తాయా!” అని పోట్లాడుతుంది.

ఒకమాటెప్పుడో నవ్వుకథేదో వ్రాశాను. సంతో షిస్తుందికదా అని లక్ష్మికి చూపినాను. శ్రద్ధగా తనలో చదువుకొని, యేమీఅనకుండా చేతి కందించింది.

“నవ్వు రాలేదూ,—ముంగిలాగు మూతిముడుచుకొని చదివావు?” అన్నాను.

“ఏడవలేక నవ్వాలి, మీకవిత్వంచూసి.”

“అదిగో, నోటిదుడుసుతనం మహా ఉందిసుమా, నీకు!” అన్నాను కోపంతో.

“నిజం ఆడితే నిష్ఠూరం! ముందుగానే చెప్పలేక పోయారూ, యీకథ చదువుతూ నవ్వాలిసుమా అని? నాకేం తెలుసు, అది హాస్యంకథ అని? మీవంటి కోపదారికవులు హాస్యాలువ్రాస్తే, దూర్వాసముని సరసంవలె ఉంటుంది.”

చిన్నపుచ్చుకొని ఊరుకున్నాను. నావేపు అట్టే నిదా నించి చూసి, పకపకనవ్వుతూ, “ముక్కుమీద ఉంటుంది, కోపంమీకు! ఏమంటారో చూదామనే, నేనూ యెత్తుయెత్తేను. నవ్వొచ్చినా అణచిపెట్టుకొని, నవ్వలేదు. అంతేకాని మరేం లేదు. కథ చాలాబాగుంది” అని సమాధానంయిచ్చి, వొళ్లు పులకరించేటట్లు పొగడింది.

ఇట్లాంటిముచ్చట్లు వెనుకటివెన్నో జ్ఞాపకంవచ్చేయి. కథ చదువుదామన్న అభిలాషకొంచెం తగ్గింది. కాని చదవక

పోతే లక్ష్మికి కోపంవస్తుంది. సొగసుకత్తెలకు అలకకూడా ఒక శృంగారమే అన్నమాట యెరుగుదునుకాని, లైటు కొంచెం పెద్దదిచేసి, కాగితాలు తీశాను, కథచదవడానికి.

అవతల వర్షం ప్రారంభమైంది కాబోలు, చినుకుల చప్పుడు వినవచ్చింది. గాలి తీవ్రంగా వీస్తూవుంది, కిటికీలలో నుండి. దీపం నిలిచేటట్లులేదు. ఉయ్యాల్లో వున్నపిల్లవాడు కెవ్వున యేడుస్తూలేచేడు. తృళ్ళిపడి లేచింది లక్ష్మి.

"పోనీ, రేపు చదువుకుందాంలే, కథ. ఇంకా కొద్దిగా వ్రాయవలసివుందికూడా. పద, నాకూ నిద్రవస్తూవుంది" అంటూ దీపంతగ్గించి లేచేను.

# సుశీల

"పుట్టినాడవు గొప్పయింటను
గట్టివాడవు చదువుసంధ్యల—
కొట్టితిట్టగ భార్య నీగతి
యెట్టి పాపంబో?

మెచ్చి నీ నగుమోము తీరును
వచ్చినట్టి వయోవిలాసము
హెచ్చుకట్నము లొసగి బాలిక
నిచ్చుటిందులకా?

పిల్లనిచ్చినవారి నెంచక
తల్లిదండ్రుల గణనసేయక
చెల్లునా యిటుసేయ మిత్రమ!
పిల్ల చిన్నదిగా?

దుష్టమిత్రులగూడి పాడయి
నష్టపడి ధనగౌరవంబుల
నష్టకష్టము లేలపెట్టెదు
నిష్ఠురత సాధ్వీన్?

తప్పుత్రాగుచు నొడలు దెలియక
ఒప్పు తప్పరయంగ జాలక

తప్పుమాటల వదరుచుందువు
మప్పిదము లేకగ.

ఏలదన్నితి వామెనిర్దయ
శీలవతిని గుణాఢ్యురాలిని?—
ఆలసించక చూపుమోయి! సు
శీల యెక్కడనో."

అనెడి మిత్రుని పాణిపల్లవ
మనునయంబునబట్టి మెల్లన
వినయముగ తాబలికెనిట్టుల
వేణు గద్గతికగ.

"బుద్ధిహీనుడనైతి మిత్రమ!
శుద్ధమూర్ఖత జేతులారగ
ముద్దువట్టిని చంపుకొంటిని
నిర్దయామతినై.

అరయకుంటి సుశీల గుణముల
నరయకుంటిని మంచిచెడ్డల
పరమపాపము గట్టుకొంటిని
క్రూరకర్ముడనై.

నాగరికమని విర్రవీగుచు
పగలురాత్రియుగూడ త్రాగుచు

మగువనొల్లక మాయకాంతల
మరగి చెడిపోతిన్.

ఎన్ని యిడుముల గుడువజేసిన
నన్ను మదిలో ద్వేషమెంచక
కన్నవారికినైన చెప్పక
నన్ను తాంగి మనెన్.

ప్రేమమీరగ నన్ను గూడుచు
ప్రేమఫలమున కాశజెందుచు
క్రమవిధాన ధరించె గర్భము
లేమ ముదమందన్.

ఖలుల సహవాసంబు కతనను
చెలుల లోలుడ నౌటచేతను
బాల్యపై ననుమానమందితి
శీలమెంచక, హా!

న్యాయమెంచక నీచమిత్రుల
మాయమాటల నమ్మికొంటిని
కోయిలేదో కాకిగూటను
కూయునను భ్రాంతిన్.

తాపమొదవగ హృదయమందున
కోపభరమున నాపె దన్నితి

నేపము దెలుపక, నెయ్యమెంచక
నీచహృదయుడవై.

తనువు దెలియక మ్రోదినాడను
కినుకబూని యకారణంబుగ
వినగనైతిని యామె యేడ్పును
వినగ మతిలేమిగా.

గర్భమందున పెరుగుచుండిన
యర్భకుని కాదెబ్బ తగులగ
దుర్భరంబయె సతికి బాధయు
గర్భస్రావమునన్.

రక్తస్రావమువలన కోమలి
శక్తిలేమిని మూర్ఛపడియెను;
యుక్తిదోచక మిన్నకుంటిని
రిక్తహృదయుడవై."

అనుచుమిత్రుని దోడ్కొనిచని
పాన్పుపై స్మృతిదప్పియుండిన
మానినిని చూపించి, ఖిన్నత
దీనుడై నిలచెన్.

ాటను
తనదు యావచ్ఛక్తిజూపియు,

ప్రాణముల నిలవెట్టు సాధన
గనమి దిగులందెన్.

"సత్యమౌస్థితి నెఱుగ గోరెదొ?..
మృత్యుముఖముననున్న దీమెయు;
హత్యచేసితి వాలుబిడ్డల—
హంతకుడ వౌరా!

తెలివివచ్చు సుశీల కిప్పుడు
బలము చాలదుసుమ్మ, గుండెకు
అలసటన్ బడనీయకూడదు......
...సెలవు గైకొందున్."

స్మృతికివచ్చినపిదప బొటబొట
సుతునికై గన్నీరుకార్చుచు
మృతియె శాంతికి సాధనంబని
యతివ తలపోసెన్.

దీనదృష్టిని నాథు బిలచియు
తనదు చెంతకువచ్చి నిలువగ
హీనమగు డగ్గుత్తికను తన
మానసము విప్పెన్.

"తప్పు చేసితినంచు దలచితొ?
విప్పిచూడుము నాదుహృదయము

నిప్పువలె నా ప్రేమమగువడు
నిష్కళంకముగన్.

ఓర్చియుంటిని నీదు నిర్దయ
కోర్చికొంటిని ప్రేమలేమికి;
ఓర్చికొన నాతరమె, బిడ్డ వె
లార్చి దునుమంగన్?

ఎన్నికష్టము లొందవినను నా
చిన్ని బాలుడు నాకులేడా
యన్న ధైర్యముకూడ నేటితో
మన్నుగలిసె కదా!

ఆశలేదిక బ్రతుకున్నపై, నవ
కాశమును లేదెందుకైనను;
బాసి శిశువును బ్రతుకజాల, హృ
దీశ! సెల''వనియెన్,

# తా చెడ్డ కోతి

మొండివాదనైనా లక్ష్మిది సూక్ష్మబుద్ధి! నా విద్యాధిక్యత, నా తెలివి తేటలు గుడ్డిగవ్వకు పనిచెయ్యకుండా ఉన్నాయి దానివాదన ముందు నాఊహాపోహ లనందర్థాలనీ, నేనాడేమాటల కర్థంలేదనీ, నాఇంగ్లీషుచదువే నాకళ్లుకప్పేస్తూ వుందనీ, చదువుకున్నవాడినన్న అహంభావంతో ద్దీ నిజం కనిపెట్టడానికి యత్నించననీ నిర్భయంగా 'ఛాలెంజి' చేసి చెప్తుంది నా మొహంయెదుట—భర్తనని మొగమాటమైనా లేక.

"స్త్రీలు, స్త్రీ ఉద్యమాలు అంటే నా కభిమానం లేదంటావా అయితే!" అన్నాను చిరునవ్వుతో.

"అయ్యో, లేకేమి? ఆడవాళ్ళంటే యిష్టంలేని మొగవాడుంటాడూ? అందులో మీ ప్రశ్న చెప్పేదేమిటి? అందంగల ఆడది కనిపిస్తే అసలు మతేపోతుంది మీకు!" అని కళ్ళతో నవ్వింది తల తమాషాగా ఊపుతూ.

లక్ష్మికది పరిపాటే. నన్నెగతాళిచేసి నాతో హాస్యాలాడడం దానికి ముచ్చట.

"తెలుసు మీ మొగవాళ్ళ నైజం! అంతా కపటమే. అభిమానం, స్నేహంచూపి సహాయం చేస్తున్నట్లు నటించి గోతిలోత్రోస్తారు. తక్కిన మొగవాళ్ళకంటె మీరు మరో ఆకు ఎక్కువే చదువుకున్నారు. ఆడవాళ్ళ హైన్యతకు జాలి

చూస్తూ, వాళ్ళకు మేలుచేదామనే సంకల్పించుకొని తుదకు హానిచేస్తారు.'' అన్నదొకమాటు స్త్రీలనుగూర్చి నేను వ్రాసిన కథల పుస్తకం చదివి.

"అన్యాయం మాటలాడకు లక్ష్మీ! స్త్రీలంటే నాకెంతో గౌరవం. ఆడవాళ్ళ నన్యాయంచేసి పురుషుడధికార బలంచేత మత్తెక్కి విర్రవీగుతున్నాడని ప్రతీమనిషికీ తెలుసు. అందుకనే కదా, స్త్రీ సంఘానికి నేనిట్టి ఉపదేశాలిస్తున్నాను? నేచెప్పే మాటలలో కపటమేముందో చూపించు. 'స్త్రీలకి స్వాతంత్ర్యం కావాలి. విద్య కావాలి. ఆరోగ్యం కావాలి. సంఘంలో వాళ్ళు గౌరవం పొందగలగాలి. లోకంలో తలెత్తి తిరగడానికి సామర్థ్యం పొందాలి. వాళ్ళమట్టుకు వాళ్ళు పోషించుకోగల శక్తి సంపాదించాలి. పురుషుడి అధికారానికి లొంగిపోకూడదు' అని కదా నాబోధన? నాకథలలో, వ్యాసాలలో, ఉపన్యాసాలలో, సంభాషణలో నేను సూచించే అభిప్రాయమే ఇది. 'ఆడచెల్లెళ్లారా! ఎన్నాళ్ళీ దాస్యంలోపడి కొట్టుకుంటారు? ఇప్పటికైనా కళ్ళు తెరచి సంకెళ్ళు తెంపుకోండి.' అని కదా నా మొర!'' అని సమాధానం యిచ్చాను.

లక్ష్మి నావేపు అట్టేచూస్తూ తలపంకించి చిత్రంగా విరిచింది మూతి. ఆలేడి కళ్ళలో కోపం, జాలి, కొంటెతనం అన్నీ ఒక్కమాటే కనిపించాయి.

"మీతో వాదించి లాభంలేదు. మీధోరణే మీది. ఎదటివారిని అర్థంచేసుకుందామన్న మర్యాదేలేదు మీలో.

ఒ క రి మా ట ఒ క రి కి పొందకుండా ఉందిమనకి" అంది నిట్టూర్పుతో.

పౌరుషం కలిగింది నాకు. ఒకరితో మాట్లాడేటప్పుడు గాని, తగవులాడే సప్పుడుగాని బహు శాంతంగా తొందర పడకుండా అన్నీ అర్థంచేసుకొని మరీ నడుచుకుంటానే, అని నా అహంభావం. ఈమె అభిప్రాయమే తెలియలేదట నాకు! అంత మట్టిమెదడుతో మాట్లాడుతున్నానా? విచక్షణజ్ఞానమే లేదా నాకు? లాజిక్కు, లెక్కలు చదువుకున్న నాకే రీజనింగ్ శక్తి లేదంటుందే! బడిలో డిబేటింగు సొసైటీలంటే ఎరుగునా? మీటింగులలో డిస్కషన్ అంటే ఎన్నడైనా చూసిందా? కచేరీలలో న్యాయవాదులు చెప్పే ఆర్గుమెంట్లు ఎన్నడైనా విన్నదా?—ఎక్స్పీరియన్సు లేదు లక్ష్మికి. బాగా స్కూల్ విద్య ఉన్నదైతే యిట్లా మాట్లాడుతుందా? ఇంచుమించు పాతికేళ్ళు ఉన్నాయన్న మాటేకాని లోకానుభవమేదీ లక్ష్మికి? ఇల్లు, పిల్లలు, పుస్తకాలు యింతే ఆమె లోకం! విద్యాజ్ఞానం తక్కువ, స్వతంత్రాలోచన లెక్కువ. పోనీ నన్ను గురువుగా భావించుకొని నావిద్యలో కొంత సంపాదించు కొని, నాఉపదేశాలను మన్నిస్తూ, నాఅభిప్రాయాలతో ఏకీ భవిస్తుందేమో అంటే అదీలేదు. మీదుమిక్కిలి నాకే బోధించి తన మతంలోకి తర్ఫీదు చేస్తానంటుంది. స్వతంత్రా లోచన లేని దాస్యబుద్ధిఅట నాది—సూచావాచా తేల్చిం దొకమాటు. అడ్డమైన పుస్తకాలు చదివి, అందరి అభి ప్రాయాలతోను ఏకీభవించి, ఈమహానుభావుడిట్లా అన్నాడనీ,

ఆకవి శ్రేష్ఠుడట్లా వ్రాశాడనీ, తప్పుడుకూతలు మనసు క్కెక్కించుకొని నామట్టుకు నేను ఆలోచించుకోవడమే మానుకున్నానట!

ఒళ్ళు మండుతుంది నాకు ఒక్కొక్కప్పుడు లక్ష్మి అనే మాటలకు, దాని పోటుకుమాటలు, దాని పెంకెతనం— హద్దులేకుండా ఉంది దాని నిర్లక్ష్యానికి! ఏమన్నా ఓర్చుకుంటానని తెలుసు. నాకెంతకోపంవస్తేనేం? అవలీలగా నన్ను మరపించి, బుజ్జగించి, మంత్రించి వశపరచుకోగల నేర్పుంది ఆమెలో.

"కథచెప్తారు లెండి మనవాళ్ళు. తూతికపిట్ట అన్నదట గర్వంగా 'నేనుగాని కాళ్ళుచాచి ఆకాశాన్ని తన్నిపెట్టి ఆపకపోతే యీలోకం గతి ఏమౌను?' అని. అట్లాఉంది మీ సంగతి. స్త్రీ లోకమంతా మిమ్మల్ని బ్రతిమాలుకుందా 'మాతరఫున పని చెయ్యండి' అని! మాటూసెందుకూ మీకు!" అని పోట్లాడింది నిర్భయంగా.

"ఉపకారానికిపోతే అపకారం వెంటనే వచ్చిందంటారు యిందుకే—" అన్నాను నిట్టూర్పుతో.

"ఆడవాళ్ళ అభివృద్ధినిగూర్చి ఫలానా మహానుభావుడు పాటుబడుతున్నాడని పేరుసంపాదించుకుందుకా? ఎందుకీనటన? ఇంతకూ స్త్రీ జనానికి మీరుచెయ్యగల సహాయమేముంది? వెనకటి కోవెధవావిడికెవరో నమస్కారంచేస్తే 'నావలె చిరంజీవివై బ్రతుకు!' అని ఆశీర్వదించినదట. ఆమోస్తరుగానే

ఉంటుంది మీ మొగవాళ్ళుచేసే ఉపకారం!" అని విరసంగా నవ్వింది.

"ఏమిటీ? మా మొగవాళ్ళంతా వెధవాయలా? మీ ఆడవాళ్ళ నందర్నీ వెధవల్ని చేస్తున్నారా? నోటి దురుసు తనం కూడదు. ఎందు కన్యాయంగా నిందిస్తావు!"

"నేనేమీ నిందారోపణ చేయలేదు. ఉన్న నిజం మనవి చేస్తున్నాను. అంతే."

తృళ్ళిపడ్డాను నేను. విపరీతంగా వినిపించాయి లక్ష్మి మాటలు.

"నీ అభిప్రాయం తెలియలేదు నాకు" అన్నాను బొమలు ముడిచి.

"తెలియదు. నేనన్నదీ అదేకదూ? ఏదీ అర్థంచేసుకో లేనివాళ్ళు తగుదునమ్మా అని ప్రతీదానికీ ఎందుకు సిద్ధ పడాలి? మీ కేం తెలుసునని ఆడవాళ్ళ సంగతి? వాళ్ళ ప్రకృతి, వాళ్ళ ఊహలు, వాళ్ళ ఆశయాలు ఏవీ మీ మొగవాళ్ళకు తెలియవు కదా! సృష్టి ప్రారంభించినద మొదలు ఈఅన్యాయం యిట్లానే వొస్తూ వుంది. ఆడదాన్నిగూర్చి ప్రతీ విషయం లోను పురుషుడు కలగజేసుకొని, సర్వం తెలిసినవాడివలె నటించి తుదకు దాన్ని అధోగతికి తెచ్చాడు. భూమిమీద పడ్డది లగాయతు ఆడది ఎట్లా నడుచుకోవాలో పాపం దయ తలచి అంతా నిర్ణయించాడు! అది చెయ్యవలసిన కర్మ విధించాడు. శాస్త్రాలు వ్రాశాడు. ఆచారపద్ధతులు నేర్పేడు.

అన్నీ దానిమేలు తలపెట్టే చేసినట్లు నమ్మించాడు. తనకు సంఘంలో దానికి ప్రత్యేకస్థానం లేకుండా చెయ్యగలిగాడు. ఆమెలో ఉన్న ఇండివిడ్యుయాలిటీని చంపి తన బానిసను చేసుకున్నాడు స్త్రీని! ఈ బానిసత్వమే ఆమెకు మోక్షం ప్రసాదిస్తుందంటాడు పైపెచ్చు. అమాయకంగా అతని బొల్లి మాటలకు అనేక శతాబ్దాలనుండి లొంగిపోయి ఇప్పుడీస్థితికి వచ్చింది ఆడది!" అంటూ ఉద్రేకంతో ముక్కుపుటము లెగరవేస్తూ గంభీరంగా ఉపన్యసించడం ప్రారంభించింది.

మెల్లగా నవ్వి "నిజమే అనుకుందాం మాటవరసకి. చేసినతప్పు దిద్దుకుందుకు పురుషుడు యత్నిస్తూ వున్నప్పుడు మళ్ళీ అభ్యంతర పరచనేల? మంచి చెయ్యబోయేవాళ్ళనెందుకూ ఆటంకపరుస్తావు?" అని అడిగాను.

"మీావశంకాదు ఏంచెయ్యడానికీ యిప్పుడు. తోడేలు గొర్రెపిల్లకేంసహాయం చేస్తుందో మీారూ ఆడదాని కట్టి సహాయమే చెయ్యగలరు. స్త్రీలకు స్వాతంత్ర్యం పురుషుడు సంపాదించడమేమిటి? అసందర్భం! ఇంతకూ అతగాడికి మాత్రంమహాయేడిసింద్రా యేమిటి నిజమైన స్వాతంత్ర్యం?... దౌర్జన్యం చేసి ఆడదాని జన్మ హక్కులన్నిటినీ లాక్కున్నది చాలదూ? సాగినన్నాళ్ళు అ ధి కా ర ం చెలాయించాలనే ఉంటుంది కాబోలు!...కాని"

"అదికాదు లక్ష్మీ! నీఅపనమ్మకం కొద్దీ నువ్విట్లా మ్మాట్లాడుతున్నావు. కాని దాస్యవిముక్తిపొంది ఆడది సంపూర్ణ

స్వాతంత్ర్యం అనుభవించాలని నా అభిలాష. నేను పాటు పడుతున్న దందుకే" అని చెప్పేను.

"మీఉద్దేశం మంచిదే కావచ్చును. కాని క్రియ మాత్రం సున్న. ఒక వేళ మీరు మేలుచెయ్యడానికే తలపెట్టినా పర్యవసానం కీడుగా పరిణమించక మానదు" అని కొంత సేపాలోచిస్తూ ఊరుకుంది.

"స్త్రీ సంఘంలో ఇప్పుడుద్భవించిన కల్లోలం మహా చిత్రమైనది" అని మళ్ళీచెప్పడం ప్రారంభించింది. "లేని హక్కులు సంపాదించుకుందామనీ, పురుషులతో సమానంగా అన్ని విషయాలలోను ప్రవర్తించుదామని ఏవో అర్థంకాని కోర్కెలతో కొట్టుకొంటున్నారు స్త్రీలు. మండుతూవున్న జ్వాలలో మీవంటి బుద్ధిమంతులు ఒక్కొక్క సమిధ వేస్తు న్నారు. కొంపలంటుకొని సర్వనాశనం కావడానికి వచ్చి నట్లుంది యిదంతా? పోగొట్టుకున్న స్వాతంత్ర్యాన్ని సంపా దించుకోవడానికి స్త్రీ యత్నించడం సహజమే. అవసరమని కూడా ఒప్పుకుంటాను. కాని పురుష సహాయానికి ఆశించడం బుద్ధితక్కువ. ద్వేషరహితమైన శాంతియుద్ధం చేసి మొగ వాడిని గెలిచి తనరాజ్యం తా స్వాధీనపరచుకోవాలి స్త్రీ. స్వాతంత్ర్యమనేది ఒకరు ప్రసాదించవలసినదికాదు. ఎవరి మట్టుకు వారే సంపాదించుకోవాలి. ఒకరిసహాయంపైని ఆధారం పెట్టుకుంటే వీరామిక్కిలి వాళ్ళకు కృతజ్ఞత చూపవలసిన అవసరంవస్తుంది. కృతజ్ఞత భక్తిగా మారుతుంది. భక్తి సేవ లోకి దిగుతుంది. సేవ దాస్యంగా పరిణమిస్తుంది. ఈవిషయమ

చక్రంలో తగులుకుంటే చుట్టూ తిరిగి మళ్ళీ మొదటికే రావడం తటస్థిస్తుంది. ఏం లాభం?"

ఈ ఆర్గ్యుమెంటు చిత్రంగా తోచిందినాకు. "అందుకనే స్త్రీలు పురుషుల నెదిరించి, ధిక్కరించి స్వాతంత్ర్యం గణించుకోవాలంటున్నాను నేను" అన్నాను.

"జాతివైరం (Sex War) కూడదు!... స్త్రీ పురుషులొకరితో ఒకరు ఎన్ని వైరాలు పెట్టుకున్నా ఒకరిపట్ల ఒకరికి గల సహజమైన ఆకర్షణ ఎన్నటికీ నశించదు. అట్టి ఆకర్షణే ఉభయులకూ కొంత శాంతి నిస్తూవుంది. మీవంటి మహానుభావుల ప్రబోధాలవలన ఆ కాస్త శాంతికూడా చస్తుందేమో! ...స్త్రీలు తమ ఆధిక్యతను నిరూపించుకోవాలంటే సెక్సు వైరం చూపి పురుషులతో పోటీచేసి వాళ్ళను జయించాలని కదా మీఉపదేశం? మాలోకూడా అనేకమంది ఈతప్పు అభిప్రాయంతోనే ఉన్నారు. అన్ని విషయాలలోను పురుషుడినే ఆదర్శంగా తీసుకొంటూవుంది ఈకాలపు నారీమణి. తనలో ఉన్న ప్రత్యేకవ్యక్తిత్వం మరచిపోయింది. సృష్టికి మూలమైన ఆడ, మొగ, అన్న లింగభేదంకూడా పాటించకుండా ఉంది. మొగవాడితో పోట్లాడి తనుకూడా మొగవాడవుదామని వెర్రి పడుతూవుంది. తుదకు ఉభయభ్రష్టత్వం అవుతుందేమో ఆమెగతి! నాగరికులమనీ, స్వాతంత్ర్యం గల వాళ్ళమనీ విర్రవీగే పాశ్చాత్యదేశ యువతులకుకూడ యిదే వెర్రి. వాళ్ళు తమలో ఉండే ఆడతనాన్ని చంపుకుంటున్నారు. మగచేష్టలు నేర్చుకుంటున్నారు. మాతృత్వం వహించడానికి

అసహ్యించు కుంటున్నారు. దేవుడిచ్చిన అంగసౌష్టవాన్ని సహితం వికృతపరుచు కుంటున్నారు. మాటలలో, రూపంలో, చేష్టలలో అన్నిటిలోను పురుషత్వం వహిస్తున్నారు. దొరసాని జుట్టు కత్తిరించుకొని గుండు చేసుకొంటూవుంది. షరాయి తొడిగి పులివేటకు సిద్ధపడుతూవుంది. ఈతలో, గుఱ్ఱపు స్వారీలో, కసరత్తులో పోటీకి నిలబడి మొగవాడిని ఓడిస్తూవుంది. ఫ్రాన్సులోను, అమెరికాలోను ఈకాలపు బాలికలు కొందరు వక్షోజాలను పెరగనివ్వకుండా శస్త్రం చేయించు కుంటున్నారట. రూపంలోకూడా ఆడతనం విశదపడకూడదని అభిప్రాయం కాబోలు! చాతనయితే సృష్టికర్తతో దెబ్బలాడి మీసాలు గెడ్డాలు మొలిపించుకుంటారేమో! వివాహాన్ని వెక్కిరిస్తున్నారు. దాంపత్యాన్ని అగౌరవిస్తున్నారు. సంతానం అక్కరలేదంటున్నారు. పాతివ్రత్యాన్ని పరిహాసిస్తున్నారు. సంఘాన్ని, దేవుణ్ణి ధిక్కరించి కళ్ళెములులేని గుఱ్ఱాలవలె చెలరేగుతున్నారు. వినరానిమాట ఏదైనా చెవిని సోకితే చాలు, పూర్వకాలం స్త్రీలు మూర్ఛపోయేవారట! ఇప్పుడో? ఆడవాళ్ళకు సహజంగా ఉండవలసిన బిడియం, భీతి, సిగ్గు, నాజూకు, సుకుమారత్వం అన్నీ అడుగంటి నశించాయి. శరీర లావణ్యం చెడిపోయింది. మాటలలో మార్దవంపోయి మోటుదనం వచ్చింది. శీలం, ముగ్ధత్వం, సరళత మొదలయిన విప్పుడు 'ఫాషన్సు' కావు! నేటి స్త్రీని 'అబల' అంటే మూతి మీద తంతుంది. మొగవాడికీ తనకీ యేమీ భేదం లేదనిన్నీ, ఇరువురికీ సమానహక్కులే ఉండాలనిన్నీ, ఈకాలపు స్త్రీ

పోట్లాడుతూవుంది. ప్రపంచంలో అన్ని దేశాలలోను యిదే కలకలము. ఒక్క ఇటలీలో మాత్రం స్త్రీలు, స్త్రీలుగానే ఉండడానికి ఇష్టపడుతున్నారు. ఇటీవల హిందూదేశపు స్త్రీల లోకూడా యిట్టి సంచలమే ఉద్భవించింది. మగ రుచులకు అలవాటు చేసుకుంటున్నారు మన స్త్రీలు. మగవాళ్ళ ఆటలు, మగవాళ్ళచదువులు, మగవాళ్ళపనులు, మగవాళ్ళమాటలు– అన్నీ మగవాళ్ళవే అభ్యసిస్తున్నారు. ఈనవీన నాగరికత స్త్రీలను అభివృద్ధికి తేక క్రిందికి దిగలాగుతూవుంది. ఆడది మొగవాడివలె ప్రవర్తించబోయినా, మగవాడు ఆడుదానివలె నడుచుకున్నా పరమ అసహ్యంగా ఉంటుంది. మీ మొగవాళ్ళలో ఆడంగి వెధవలని ఉంటారు ఎరగరూ? ఆడమొగలంటారు వాళ్ళని. వాళ్ళ సేడిమొహాలు, ఆడచేష్టలు చూస్తే రోతపుడుతుంది. వాళ్ళలో కొందరు బట్టకట్టులోకూడా ఆడతనం వెల్లడి పరచుకుంటారు. చీరె కడతారు. జుట్టుపెంచి పువ్వులు ముడుచుకుంటారు. కాటుక పెడతారు. ఒయ్యారంగా పైట సద్దుకోవడం అభినయిస్తారు. తిప్పుకుంటూ నడుస్తారు క్రీగంటి చూపులతో. సిగ్గు నటిస్తూ మొగవాళ్ళతో నంగిరి నంగిరిగా మాట్లాడుతారు. ఎన్నెన్ని వెధవచేష్టలు చెయ్యాలో అన్నీచేస్తారు. అట్టి అధముల్ని చూసి ఆడవాళ్ళు నవ్వుకుంటారు జాలిపడి. మొగవాళ్లు రోతపడి కోపగించుకుంటారు. వీళ్ళమోస్తరే మాఆడవాళ్ళలో కూడా మగలక్షణాలు గలవారున్నారు. గట్టిశరీరం, మోటుమొహం, బల్లపరుపువక్షం, బొంగురుగొంతుక, మూతిమీద చిన్నమీసకట్టు మొదలయిన

అవలక్షణాలుగల వయ్యారులెందరో ఉన్నారు. ప్రకృతి విరుద్ధమైన చేతగాని పనులుకూడా చెయ్యడానికి పాపం ముచ్చటపడతారంట వీళ్ళు! మొగవాళ్ళను చూస్తే భయపడి దూరదూరంగా జరగడం, ఆడవాళ్ళని చూసి మోజుపడడం– ఏమని చెప్పను వాళ్ళచర్యలు! ఎవరిలోఉండే సహజ శక్తులను వాళ్ళు దోహదంచేసి పెంచుకుంటే అవి రాణిస్తాయి. లేని శక్తులు నటించడానికి యత్నిస్తే అవి బెడిసికొడతాయి. ఆడ దాని 'గ్లోరీ' ఆడతనంలోను, మగవాడిఘనత మొగతనంలోను స్పష్టపడాలి. అంతేకాని వీళ్ళలో ఉండే ఔన్నత్యం వాళ్ళు సంపాదించడానికి యత్నించడం అసహజమే కాక బుద్ధిహీనం!''

నిర్ఘాంతపడి వింటూ కూచున్నాను లక్ష్మీ ఉపన్యాసం. ఏంచెప్పడానికీ తోచలేదు కొంతసేపటివరకూ. స్త్రీల మూవ్ మెంటులో నడుంకట్టి పనిచేదామన్న అభిలాషే కాని ఈ సంగతులన్నీ తట్టలేదు నాకెన్నడూ. నేనుచేసేకృషి యావత్తూ స్త్రీ లోకానికి మేలు చెయ్యడానికిబదులు కీడు చేస్తుందని ఘంటాపథంగా చెప్తూవుంది లక్ష్మి. అయితే నేనేపని తల పెట్టినా పరిహాసంచేసి ఆక్షేపించడం దానికి మామూలే. ఒక్కొక్కప్పుడు కేవలం పెంకెతనానికే తీవ్రంగా వాదిస్తుంది నాతో. మనసులో నాయభిప్రాయాలను మన్నించినా పైకి మాత్రం అడ్డువాదనచేస్తుంది. కళ్ళలో నవ్వుపొంగుకొచ్చినా మూతిబిగించి గంభీరంగా పెడుతుంది మొహం! లక్ష్మిలో ఉన్న హాస్యం, అలక, పెంకెతనం అన్నిలక్షణాలు నాకు అనుభవవేద్యములే కాని ఇప్పుడున్నంత 'సీరియస్ నెస్' ఆమె

ముఖంలో నాకెన్నడూ పొడగట్టలేదు. దాని నవ్వు మొహంలో కపటం దాగదు.

"సరేకాని లక్ష్మీ! స్త్రీల పురోభివృద్ధికి పాటుపడాలను కున్న బుద్ధిమంతులిప్పుడు ఏంచెయ్యాలని నీఅభిప్రాయం? నీధోరణిచూస్తే తప్పంతా మామొగవాళ్ళదేనని సారాంశం తేలేటట్లుంది. ఆడవాళ్ళకి మేం మొగతనంనేర్పి, ఆవుదూడల్ని గేదెదూడలుగా చెయ్యబోయి అర్ధాన్నపుదూడల్ని చేస్తూ ఉన్నట్టు చెపుతున్నావు! న్యాయమేనా?" అని నవ్వుతూ అడిగాను.

"సొంతం చెప్పేదాకావినండి. ఆనక దెబ్బలాడుదురు గాని. మీ మొగవాళ్లేమో మహా ఘనులైనట్లు తమప్రతాపా లన్నీ నేర్పుతామంటారు స్త్రీకి. అన్నీ అవకతవక సలహాలే యిస్తారుకదా! వాటి పర్యవసానం మన స్త్రీలలో కొంతవరకు ప్రత్యక్షమౌతూనే ఉందకదా? అంతకంతకూ మీరు సెక్సు వైరం పెంచుతున్నారు కాని మరేమీలేదు. మీదుమిక్కిలి 'ఇమాన్సిపేషన్' అనీ, 'ఇండిపెండెన్స్' అనీ, 'ఇండువిడ్యు యాలిటీ' అనీ, 'స్వరాజ్' అనీ పెద్దపెద్దపేర్లు చెప్పి భ్రమింప జేస్తున్నారు స్త్రీని. ఔనా!" అన్నది ఉద్రేకస్వరంతో.

"అదికాదు. ఆడదానిలో అనేక అద్భుత శక్తులు ఉన్నాయనీ, వాటిని బయటికి రానివ్వకుండా మగవాడు అణచిపెడుతున్నాడనీ, సంఘం కొంతవరకు వాడికితోడ్పడుతూ ఉందనీ కాబట్టి స్త్రీ యిప్పుడు స్వాతంత్ర్యరాలవుదామంటే

పురుషుడి నెదిరించి ప్రతీ విషయంలోను తనుకూడా శక్తి సామర్థ్యాలుగల మనిషే అని రుజువు చెయ్యాలనీ, సంఘ నిబంధనలను ధిక్కరించాలనీ, అవసరమైతే యిప్పుడున్న సంఘాన్ని శిథిలంచెయ్యాలనీ, ముఖ్యంగా తన ఇండివిడ్యుయాలిటీని ప్రకటించుకోవాలనీ నాఉపదేశం" అని సమాధానం యిచ్చాను.

"పొరబడుతున్నారు మీరు. స్వేచ్ఛంటే సంఘ తిరస్కారమని అర్థంకాదు. సంఘంలో లోటుపాట్లుంటే సవరించడం మెప్పు—చాతనయితే. అంతేకాని సంఘాన్ని భగ్నంచేసి దేవున్నై గురువున్నై అని నడుచుకుందామంటే వీలులేదు. ఈ సంసార సాగరంలో మానవ జీవితమొక పడవ వంటిది. సంఘము దానికొక చుక్కానీ. ప్రత్యేక వ్యక్తిత్వమంటే ఏకాకి తనమనుకోకూడదు" అంటూ యోచిస్తూ ఒకక్షణం ఊరుకుంది.

"—అదిగాక" అని ప్రారంభించింది మళ్ళీ. "ప్రత్యేక వ్యక్తుల యిష్టాయిష్టాలను లోకం మన్నించ దలచుకున్నప్పుడు సంఘానికిగల బలం సహజంగా క్షీణిస్తుంది. ఒకయింట్లోఉన్న ప్రతిమనిషీ యెవరియిష్టంచొప్పున వారు నడుచుకుంటామన్నా, లేక అందరూకూడా అన్నిపనులు చెయ్యడానికి సిద్ధపడినా ఆఇల్లు నిమిషంలో కూలవలసిందేకద? మానవ సంఘంకూడా ఒకగృహం వంటిదే. జనుల అన్యోన్య సహాయంవల్లనే సంఘానికి కొంత ఐకమత్యం, గౌరవం, బలం కలగుతూ ఉన్నవి. సంఘసౌఖ్యం, సంఘహక్కులు పొందాలంటే నరుడు సంఘాన్ని

ధిక్కరించలేదు—ధిక్కరించకూడదు. ఈఇరవయ్యో శతాబ్దంలో అందరికీ ఒకటే పిచ్చి పట్టుకుంది. ప్రతీమనిషీ తన జీవితాన్ని ప్రత్యేకంగా తనే నడుపుకుందుకు యత్నం— సంఘ సహాయంకాని యితర సహాయంకాని కోరకుండా. కాని యిందులో ఉన్న ప్రమాదం ఎవరూ గుర్తించకుండా ఉన్నారు. సంఘాన్ని వదులుకోజూచిన వ్యక్తికి నిజంగాఆలోచిస్తే ప్రత్యేక స్థానం ఈ భూమిమీద ఎక్కడాలేదు. రాజ్యాంగవేత్తలకీ రహస్యం తెలుసును. ఏదేశం ఇష్టంవచ్చినట్లు ఆదేశం నడుచుకోవడంలో లోకానికి గొప్ప ముప్పు అనే సంగతి మొన్నటి జర్మనీ యుద్ధంతో అందరికీ విశదమైంది. కనుకనే 'లీగ్ ఆఫ్ నేషన్స్' అనే నానాదేశ సంఘమొకటి నిర్మింపబడ్డది. ప్రత్యేక జీవితమనేది ఒక వ్యక్తికిగాని ఒకదేశానికిగాని పొసగనిసంగతి! అదిగాక ప్రత్యేకజీవితానికి స్వాతంత్ర్య జీవితానికి యెంతో వ్యత్యాసం ఉంది. అది గ్రహించక స్వాతంత్ర్యంలోగల మహత్యం ప్రత్యేకవ్యక్తిత్వంలో ఉన్నదని మగవాడు బోధిస్తున్నాడు స్త్రీకి. స్వేచ్ఛఅనుభవించడమంటే యిష్టంవచ్చినట్లు చెలరేగడం కాదు. ఇండిపెండెన్స్ అంటే ఐసాలేషన్ కాదు! నాగరికతంటే అన్యదేశలోపాలను అలవరుచుకోవడం కాదు. కాని పురుషుడు ష్ట్రిపక్షివంటివాడు. అహంభావమనే యిసకలో తలదూర్చి, నిజాన్ని చూడడానికి యిష్టపడడు. నాగరికతన్న పేరున ఎన్నెన్ని అరాచకాలైనా చేస్తున్నాడు. తన జీవితాన్ని అసౌఖ్యమయంగా చేసుకుంటున్నాడు. తాచెడ్డకోతి వనమంతా చెరచిందన్నట్లు ఆడదాన్నికూడా ఈడుస్తున్నాడీతప్పు

తోవలోకి! తనలో తన నడవడికలో ఉండే వక్రత గుర్తించడు.
వేమన్న చెప్పినదే వేదమన్నట్లు తాసూచించిన మార్గాన్నే
ఆడది నడుచుకొని బాగుపడాలంటాడు. తన విద్యలు, తన
ఆశయాలు, తన పరిశ్రమలు అన్నీ తనవే స్త్రీలకుకూడా
ముక్తిదాయకము లనుకుంటాడు. నవీననాగరికతకు తానెట్లా
వశమౌతున్నాడో ఆడదాన్నికూడా అట్లే వశపరచాలని కోరు
తున్నాడు. పులినిచూసి నక్క వాతపెట్టుకున్నట్లు స్వాతంత్ర్యం
రాజ్యైశ్వర్యంగల పాశ్చాత్యదేశస్థులను మార్గదర్శకులుగా తీసికొని
హిందువుడు తనలో ఉన్న గొప్పతనాన్ని రూపు మాపు
కున్నాడు. ఆడదాని పూర్వాచారపద్ధతుల నగతాళిచేసి దాని
నొక దొరసానివలె తర్ఫీదు చెయ్యబోతున్నాడు. "అయితే
ఆడదానికి స్వతంత్రబుద్ధి లేదా? మగవాడిబోధన లెందుకు
వినాలి? దానిదారినది నడుచుకోరాదా?" అని అడుగుతా
రేమో! ఆడదాని ప్రకృతిలో ఒకచిత్రమైన లక్షణమున్నది.
స్వార్థత్యాగం ఆమెకు సహజభూషణం! ఒకరికొరకు, ఒకరిని
సంతోషపెట్టుటకొరకు ఆమెచేయగల త్యాగాలకు మితిలేదు.
తనసౌఖ్యం చూసుకోదు. తన బ్రతుకుతెరువు ఆలోచించదు.
తనమేలు కాంక్షించదు. పరోపకారానికిపోయి పడరాని పాట్లు
పడుతుంది. దేనికీ విసుగులేదు; కించలేదు; పగలేదు; ఫలాపేక్ష
లేదు. క్షమాదేవివలె పురుషుడి లోపాలను మన్నిస్తూ, అతని
అత్యాచారాలను సహిస్తూ అతని సేవకై తనజీవితాన్ని విని
యోగపరుస్తుంది! చెడ్డపని అయినాసరే, పురుషుడికి హితవు
గూర్చేదని తలచినప్పుడు తప్పక చేస్తుంది. మగజాతియెడ్ల

అనాదినుండి ఆమెకట్టి అభిమానం కలదు. అయితే మొగ
వాడు తనపత్రాపంకొద్దీ ఆడదాన్ని తన చిటికెనవేలుమీద
తిప్పుకో గలుగుతున్నట్లు భావిస్తాడు! పురుషుడి ఉపదేశాలలో
గల వక్రత గుర్తెరిగికూడా అతను చెప్పిన చొప్పున ఆచరించి
నందుకు సంబర పడుతుంది స్త్రీ. అతని అసందర్భపు ఆజ్ఞలను
పాలిస్తుంది. పిచ్చి సలహాలను వింటుంది. నూతిలో పడుఅంటే
పడుతుంది. అగ్నిలో దుమకమంటే సిద్ధపడింది సీత. సంతలో
పశువు నమ్మినట్లు నడిబజారులో పెళ్ళాన్ని విక్రయిస్తానంటే
ఒప్పుకుంది చంద్రమతి. కొడుకును విషంపెట్టి చంపుతానని
హిరణ్యకశిపుడంటే నోరెత్తలేదు అతనిభార్య. మనసు కర్ణుడి
మీద ఉన్నా పాండవుల్ని ఐదుగురినీ మెడకుకట్టుకొని భరించ
మంటే ఎదురు చెప్పలేదు ద్రౌపది. మొగుడుచస్తే వాడి చితి
మీద సహగమనం చెయ్యడం ధర్మమని బోధిస్తే సరేనన్నది
హిందూనారి. ఎన్నిశతాబ్దాలు గడచినా దేశకాల పరిస్థితు
లలో ఎన్నిమార్పులు వచ్చినా ఆడదాని ప్రకృతిలోమాత్రం
ఈ నైజం మారలేదు. మొగవాడంటే పడిచస్తుంది. వాడి
మాటంటే వేదవాక్యంగా భావిస్తుంది. నాగరికత అభివృద్ధి
పొందిన ఈరోజులలో కూడా మనహిందూ స్త్రీ ఎప్పటివలెనే
ఉన్నది. "మన పురాణాలు పుక్కిటికథలు చదువకు; ఇంగ్లీషు
నేర్చుకో; పసుపు కాటుక విడిచిపెట్టు; ఫేస్‌పౌడరు పిన్నులూ
వాడు; ఆచారమనీ, పూర్వసాంప్రదాయమనీ అనాగరికంగా
ఉండకు; ఓటింగుహక్కులకు పోట్లాడు; విడాకుల చట్టంకావా
లని మొర్రపెట్టు; మొగవాడి ఉద్యోగాలకు పోటీచెయ్యి;

కొత్తభాషన్లు నేర్చుకో; దొరసానివైపోవాలి నువ్వు'. అని కాని భర్త ఉపదేశిస్తే 'అలాగే' అంటుంది. లేక 'మన దేశ చరిత్ర చదువు; హిందీ నేర్చుకో; రాట్నం వడికి ఖద్దరు-చీర కట్టుకో; కల్లుదుకాణాలు పికెట్ చేసి దేశంకోసం పాటుపడు; నాతోపాటు జైలుకుపద' అని చెప్తే 'సరే' అంటుంది. ఆడ దాని కెట్టి స్వాతంత్ర్యం కావాలో అది సంపాదించుకుందుకు ఆమె ఏవిధంగా పాటుపడాలో, ఆమెకెట్టి నాగరికత అవసరమో, ఆమె జీవితానికేది సౌఖ్యప్రదమో అన్నీ తనే నిర్ణయిస్తా నంటాడు పురుషుడు. దేనికీ అభ్యంతరం చెప్పదామె! "ఆడదానికి మెదడు, హృదయం, అనేవి లేవనుకుంటాడుకాబోలు పురు షుడు! మెత్తనివాళ్ళనుచూస్తే మొత్తబుద్ధి అంటారు ఇందుకే నేమో. మామంచితనమే మాకు శత్రువౌతూవుంది. మగ వాడి ఉపదేశాలను లక్ష్యపెట్టక తనకు దేవుడిచ్చిన గౌర వాన్ని తను నిలబెట్టుకుందుకు పాటుపడితే ఆడది స్వాతంత్ర్యు రాలవుతుంది."

లక్ష్మిమాటలు విన్నపిమ్మట దీర్ఘంగా ఆలోచించ వలసివచ్చింది. అనేక సమస్యలతో మెదడు వేడెక్కి ఏదీ సరి యైన సమాధానం అప్పటిమట్టుకు తోచలేదు.

"నన్ను నువ్వేమన్నా సరిపోతుంది కాని పురుష లోకాన్నంతా దూషించకు. నీపుణ్యముంటుంది. ఇంతకూ అసలు నీమనసులో ఉన్న అభిప్రాయమేదో స్పష్టంగా అర్థం కాలేదు నాకు" అన్నాను.

"ఆడవాళ్ళ నెట్లా అర్థంచేసుకోగలరు మీరు!" అంటూ పక్కున నవ్వింది.

# అపుత్రస్య—?

వెంకోబరావుపంతులు చాలా సరదామనిషి. అతనికల్లా ఒక్కటే దుర్వ్యసనం ఉండేది. విధి, విరామం లేకుండా చుట్టలు కాల్చేవాడు. కాని కొన్నాళ్ళకు పెళ్ళాంపోరు పడలేక ఆమెకు వాగ్దానంచేసినాడు 'పొగచుట్టలు మరి కాల్చను!' అని.

చుట్ట, పొడుం, నల్లమందు—ఇట్లాంటి వ్యసనాలు అభ్యాసం కాకనేపోవాలి. ఒకమాటు వాటికి అలవాటుపడితే ఇకపూర్తిగా వదలించుకోవడమనేది సాధారణంగా...... అసాధ్యం.

వెంకోబరావుపంతులును వెయ్యికళ్ళతో కనిపెడుతూ ఉండేది ఆయనభార్య. "ప్రమాణంచేసిన పెద్దమనిషికదా, మాటతిరుగుతారా!" అని భర్తనునమ్మి, ఊరుకునే యిల్లాలు కాదు ఆమె. ఇంట్లో మూరుమూలలన్నీ వెదికి, యెక్కడెక్కడ వున్న పొగాకుముక్కలు సంగ్రహించి, పెనిమిటి కవి చిక్కకుండా చేసేది.

భార్యకు లొంగినట్టే ఉండేవాడు కాని పంతులు, నేర్పుతో ఆమెను మోసంచేయడం ప్రారంభించినాడు. సర్కారు డ్యూటీ అనిచెప్పి, మాటికీ-చీటికీ కమాను బయలుదేరేవాడు—పెళ్ళాం కంట మాత్రం పడకుండా వుంటే యెన్ని చుట్టలు కాల్చినా అడిగేవారులేరుకదా అని ధైర్యం. సమ్యాటులో

ఉన్నప్పుడు శబరిలంక పొగాకు వీశెలకువీశెలు సంపాదించి చుట్టలు చుట్టించి భద్రంగా దాచుకునేవాడు ఆఫీసుపెట్టెలో. ఒకసారి గ్రహచారవశాత్తూ పెట్లో చుట్టలకట్టలు ఉన్నసంగతి భార్యకు తెలిసింది. "ఎక్కడివీ చుట్టలు!" అని ఆమె నిలవ దీసే సరికి పంతులు ముఖం వెలవెలబోయింది. క్షణం ఆలోచించి చిన్నచిరునవ్వుతో, "చుట్టలు కాల్చడం మానుకున్నా నాపాప్రబ్ధంచేత వాటిని సంగ్రహించి మోసుకొనిరావడం తప్పలేదు. ఈఅధికార్ల వ్యసనాలు కనిపెట్టి యెవడికియే వి మక్కువయితే అది జాగ్రత్తపరచి వాడికి సమర్పించాలి. క్రిందటియేడు బ్రాందీబుడ్లు సప్లయి చేసేసరికి యిల్లుగుల్లయింది. ఇప్పుడు వచ్చిన ఆఫీసరు కొంత నయమే అనుకో. శబరిచుట్ట లతో తృప్తి పొందుతాడు. ఎంతో శ్రమపడి యీచుట్టలన్నీ చుట్టించినాను. రేపు పొద్దున్నే బంట్రోతుచేత పట్టించుకొని బంగాళాకు పోవాలి." అని సమాధానం చెప్పినాడు.

పాపం ఆమె నమ్మకున్నది. పంతులు తనలో నవ్వుకున్నాడు. వెనుకటివలెకాక చుట్టలిప్పుడు రహస్యంగా కాల్చవలసి వచ్చినందున యీపాడు వ్యసనం కొంత తగ్గివుంటుందని అనుకోకూడదు. పూర్వంకన్న అధికంగా కాల్చేవాడు. దొంగతనంగా చేసే వ్యసనాలకు తృప్తి అనేది కొఱత!

పంతులు పూర్వం యిల్లుదాటి యెక్కడికీ వెళ్ళేవాడు కాడు. ఇప్పుడు యింట్లో స్థిరంగా ఒకగంట నిలవడం అరుదు. స్నేహితుల యిండ్లలోను క్లబ్బులోను షికారు స్థలాల్లోను— యెక్కడో చుట్టకు ఆటంకంలేనిచోట కాలం వెళ్లబుచ్చేవాడు.

కొత్తగా తమలపాకులు కూడా తరుచుగా నవలడం అలవాటు చేసుకున్నాడు, చుట్టకంపు కప్పి పుచ్చడానికి. చుట్టలకు బదులు పాపం కిల్లీలతో తృప్తి పొందుతున్నాడు కదా అని భార్య సంతోషించింది. క్రమంగా ఖారాకిల్లీలు ప్రారంభించి నాడు. పెళ్ళాం అభ్యంతర పెట్టలేదు. బజారు మసాలా యింపుగా లేదని చెప్పి, బరంపురంనుంచి సుబుద్ధి మసాలా తెప్పించేవాడు. కిల్లీ సామగ్రి యావత్తు యింట్లోనే జతపరచి ఖారాకిల్లీలు చుట్టడంభార్యకు నేర్పినాడు. పెళ్ళాం చూస్తూ వున్నప్పుడు కిల్లీ, ఆమె చూడనప్పుడు చుట్ట యీవిధంగా కిల్లీమీద చుట్ట, చుట్టమీద కిల్లీ, ఒక్కొక్కప్పుడు కిల్లీ నములు తూనే చుట్ట—ఈవిధంగా కొన్నాళ్ళు గడిపినాడు.

ఒకనాడు చాకలిదానికి బట్టలు వేస్తూ వున్నప్పుడు పంతులు జేబులో పొందికగా మడతపెట్టివున్న పొగాకుకట్ట దొరికింది అతని భార్యకు. భర్త వీధిలోనుంచి యింటికిరాగానే అడిగింది: "ఏమండీ మళ్ళీ చుట్టలు ప్రారంభించినారూ? మీ కోటుజేబులో పొగాకుకట్ట దొరికిందినాకు. దొంగతనంగా చుట్టలు చుట్టుకొని కాలుస్తున్నారా యేమిటి?"

నవ్వుతూ పంతులు "అబ్బే లేదు. డబ్బాలో మసాలా అయిపోయింది. రావలసిన బంగీ యింకా బరంపురంనుంచి రాలేదు. ఈలోపున రెండుమూడురోజులకు సరిపోయే మసాలా, బజారులో కొనుక్కున్నకంటె మనమే తయారు చేసుకోకూడదా అనుకున్నాను. కొట్లమీద దొరికే ఖారామసాలా కలగా పులగంగా వుంటుంది. రేపు ప్రొద్దున్న ఆపొగాకు యెండలో

పెట్టి నలిపి గుండచెయ్యాలి. చుట్టలకైతే యీపొగాకు పనికి వస్తుందా? అదిగాక యీకాస్తపొగాకు చుట్టలకేం సరిపో తుంది? దీనిని నోటి పొగాకంటారు. కేవలం మసాలా చేసు కుందుకు తప్ప మరిదేనికీ పనికిరాదు. నీ ధర్మమా అని నాకిప్పుడు చుట్టమీాదికి మనసు పోవడంలేదు. కొత్తరికం కొంచెం కష్టంగా ఉండేది. కాని యిప్పుడు చుట్టమీాద యేమీా కోరికలేదు. చుట్టలు కాల్చమని నువ్విప్పుడు బ్రతిమాలినా కాల్చను.” అన్నాడు.

మాట నిలబెట్టుకుందుకు పంతులు మర్నాడు ధని యాలు, సోపు, గసగసాలు అన్నీ తెప్పించి అవి భార్యను మూకుట్లో వేచమని ఆమెకళ్ల యెదుట పొగాకంతా నలిపి గుండచేసి ఖారామసాలా తయారు చేసినాడు.

మరికొన్నాళ్ళకు యింట్లో మళ్ళీ పోరు ప్రారంభించింది. పొగాకు యేరూపంలోను కూడా వాడరాదని పంతులుభార్య నిర్బంధించింది. తాంబూలానికి మాత్రం ఆమె అభ్యంతరం చెప్పలేదు. కానీ ఖారాకిల్లీ, చుట్ట—ఈరెండిటికీకూడా ఆమె వొప్పుకోలేదు. విధిలేక సరేనన్నాడు పంతులు.

అదిమొదలు బహు జాగ్రత్తగా అతి రహస్యంగా కాల్చుకునేవాడు చుట్టలు. ఇంట్లో యెక్కడా పొగాకుముక్క గాని చుట్టకాని భార్య కంటపడకుండా జాగ్రత్త పడేవాడు పంతులు.

కాని 'ప్రమాదో ధీమతామపి' అన్నారు పెద్దలు. ఎంత కట్టుదిట్టంమీద కథ నడిపిస్తూవున్నా ఒక్కొక్కప్పుడు చిక్కులలో పడుతూవుండేవాడాయన. ఒకనాడు దుస్తులు విప్పుకుంటూ వున్నప్పుడు ఆయన చొక్కాజేబులో వున్న పొగాకుకట్ట జారి క్రిందపడింది. పాపం పంతులది కనిపెట్టలేదు.

మరికొంతసేపటికి పంతులుకొడుకు—పది పన్నెండేళ్ళ కుర్రవాడు–గదిలోకి యెందుకో వచ్చినాడు. నేలమీదపడివున్న పొగాకుకట్ట కనిపించింది. తీసి చేతపట్టుకున్నాడు. ఇంతట్లో పంతులుభార్య అక్కడికి రావడం తటస్థించింది. కొడుకుచేతిలో పొగాకుచూసింది. ఆమెకు కోపముంచుకొవచ్చింది పంతులు మీద. కొడుకు చెయ్యిపట్టుకొని గదిలోనుంచి కేకవేసి పెనిమిటిని పిలచింది.

పంతులు గదిగుమ్మంలో అడుగుపెట్టేసరికి "ఏమండీ! నేనెంత నెత్తీనోరూ కొట్టుకుంటున్నా మీరు మీగుణం మానరుకదా? ఈపొగాకుకట్ట వీడికెట్లా దొరికింది? మీజేబులో నుండో, మొలనుండో క్రిందజారి పడివుంటుంది. అంతేనా?" అని తీక్ష్ణంగా అడిగింది.

భార్య మాటలకు గురికాకుండా తప్పించుకునే ఉపాయం పంతులుకు తోచలేదు. కొంతసేపు తటపటాయించి, మరో ఆలోచన యేదీ తోచనందున, లేనికోపం తెచ్చుకొని కళ్ళెఱ్ఱజేసి కొడుకువేపు తిరిగినాడు. "ఓరి కుంకవెధవా! దౌర్భాగ్యుడా! గాడిద!...నీకీపాడుబుద్ధి యెట్లా పుట్టిందిరా?

జానెడు వెధవవు! అప్పుడే నువ్వు చుట్టలు కాల్చడానికి సిద్ధపడుతున్నావా? ఎవడు నేర్పినాడురా నీకీ దౌర్భాగ్యపు పని?......నువ్వూ, నీచెడుబుద్ధులూను!...బొత్తిగా భయం లేక...సిగిరెట్లు, చుట్టలు యిదా నీచదువు? పుస్తకంమీద వుండవలసిన ధ్యానం పొగాకుమీదికి పోతూవుందేం!'' అంటూ గొంతుక పగిలేటట్టు గట్టిగా అరుస్తూ వీరావేశంతో ఉగ్ర నరసింహామూర్తివలె కొడుకుమీద తిరగబడి జుత్తుపట్టుకొని, పళ్ళుకొరుకుతూ, గభీగభీమని రెండుగుద్దులు గుద్ది "ఈమాటు నాకంటపడనీ చెప్తాను!'' అని భార్యచేతిలోవున్న పొగాకుకట్ట లాగుకొని రోడ్డుమీదికి విసిరేశాడు.

పంతులుభార్య తెల్లబోయి చూస్తూనిల్చుంది. కొడుకు వెక్కి వెక్కి యేడుస్తూవుంటే ఆమెకుకూడా దుఃఖం ముంచు కొచ్చింది. కుర్రవాడిని చేరదీసి శిరమునిమిరి ఓదార్చింది. పంతులుచేసిన గడబిడకు నిజంగా కొడుకుదే నేరం కాబోలని ఆమె నమ్ముకున్నది.

ఈ ముచ్చట జరిగిన పిమ్మట, మళ్ళీ యింట్లో యెక్కడైనా చుట్టపీలికగాని, పొగాకు ముక్కగాని, ఖర్మంచాలక ఆమె కంటపడినప్పటికీ కొడుకే వీటికి కారణమనుకొని భర్తను గద్దించడం మానివేసింది. చడీచప్పుడు లేకుండా ఆవస్తువ సంగ్రహించి పెనిమిటికి తెలియకుండా అవతల పారవేసేది. కొన్నాళ్ళవరకూ యీ విధంగా తండ్రిపాపాలు కొడుకునూ చుట్టుకొని వెంకోబరావు పంతులును కాపాడగలిగినవి.

పంతులొకనాడు తన మిత్రులతో యీముచ్చటంతా చెప్పడం ప్రారంభించినాడు.

"బాగానేవుంది కాని పాపం నిష్కారణంగా కుర్రివాడినికొట్టి బాధించినారే!" అన్నారు కొందరు.

నవ్వుతూ పంతులందుకు సమాధానం చెప్పినాడు: "అందుకనే పశ్చాత్తాపం కలిగి ఆమర్నాడే వాడికొక చిన్న సైకిలు కొనియిచ్చి తప్పు దిద్దుకున్నాను...కాని, వాడు కూడా తక్కిన ముగ్గురివలె ఆడపిల్లగా పుట్టివుంటే యెంత చిక్కులో పడిపోయివుందునో ఆలోచించకుండా ఉన్నారు మీరు. ఒక్కడైనాకొడుకంటూవున్నాడు గనుక సరిపోయింది. అందుకనే మనవాళ్లు మొగపిల్లలకోసం దేవులాడతారు. 'అపుత్రస్య గతిర్నాస్తి' అన్నవాక్యం మనపూర్వులు కేవలం స్వానుభవంమీాద వ్రాసి వుంటారు. చేతికందిన కొడుకు ఉన్నాడంటే గృహస్థన్నవాడికి చుట్ట కాల్చుకుందుకు యెంత సదుపాయంగా వుంటుందో ఆలోచించండి."

# రా జా

కరీమ్ సాయిబుగారి మేడలో బసచేశారు, సర్కస్ మెంబర్లు—ఇంచుమించు పాతికమంది. చుట్టూ పడిపోతూ ఉన్న కురచైన ప్రహారిగోడ, విశాలమైన సదునులేని పచ్చిక తిన్నెలు, ఎత్తుగా పెరిగిన చెట్లు, సంరక్షణలేక కృశిస్తూవున్న పువ్వుల మొక్కలు—అన్నీ ఆయింటి ప్రాకారానికొకవిధమైన శోభ కూర్చేవి. ఒకప్పుడు జనంతో కిక్కిరిసి, కలకల లాడుతూ ఉండే రమ్యమైన సౌధమిప్పుడు క్రమంగా పాడుపడి బూజుపట్టింది. అందులో కాపురముండేవాళ్ళెవరూ లేక, యేళ్ళకొలదీ తలుపులు మూసేవుండేవి. పూనా సర్కస్‌కంపెనీ వాళ్ళందులో ప్రవేశించగానే, మళ్ళీ కొత్తకళ వచ్చింది మేడకు. ఇంటినిండా కిటకిటలాడుతూ మనుష్యులు, సామానులు, మెరుపుదీపాలు, అలికిడి, ఉండేసరికి మృతకళేబరానికి ప్రాణం వచ్చినట్లయింది, ఆయింటికి.

తమబసకో ఫర్లాంగు దూరంలో ఉండే మైదానంమీద, ఆటకు పెద్దడేరా వేసుకున్నారు సర్కస్‌వాళ్ళు. సుమారు పదివేలమందికి సరిపోయినంత డేరా అది. దానిచుట్టూ కొన్ని చిన్నచిన్న డేరాలుకూడా వేసుకున్నారు. గుర్రాలు, ఏనుగులు, కోతులు, కుక్కలు, ఎలుగుగొడ్లు, కంగారూలు, జీబ్రాలు, పులులు, సింహాలు—ఇంకా యేవేవో జంతువులు,—కొన్ని ఆడేరాలకు దగ్గిరగాను, కొన్ని లోపల బోనులలోను, కొన్ని

వెలుపలను ఉండేవి. ఈమృగాలను, డేరాలను, చూడడానికి పురజనులు గుంపులు గుంపులుగా వచ్చి పోతూ ఉండేవారు. ఆనాలుగు రోజులూ ఊరంతా మహా అలికిడిగా ఉండేది. ఏగోడమీద చూసినా మంచిమంచి రంగుల బొమ్మలతో సర్కస్ వాళ్ల ప్రకటన పత్రికలే కానవచ్చేవి.

ఆట ప్రారంభించడానికి ఇంకా ఒకరోజు వ్యవధి ఉన్న దనగా కంపెనీవాళ్ళ యేర్పాటులన్నీ పూర్తిఅయినవి. అది శీతకాలం. డిసెంబరు నెల. వెన్నెల రాత్రులు. చలి మిక్కుటంగా ఉండేది. నాడు దీపాలు పెట్టే వేళప్పుడు సర్కస్ మెంబరు తారాబాయి మేడ దిగివచ్చి, ఆవరణలో ఉన్న బాదంచెట్టు కింద నిల్చుంది, చంద్రుణ్ణిచూస్తూ. పదహారు పదిహేడేళ్ళ జవ్వని. చలికి పొడుగైన ఉన్నికోటు తొడుగుకుంది. అందంగా దువ్వుకున్న జుట్టులో గులాబీ పువ్వులు పెట్టుకుంది. గాలికి చెదరి కళ్ళలో పడుతూవున్న ముంగురులను సవరించుకుంటూ, రోడ్డు దీపాలను, దారిని నడిచే జనులను, మోటారు కార్లను పరీక్షిస్తూ, యేదో ఆలోచిస్తున్నదానివలె పరధ్యానంగా నిల్చుంది. దూరంగా ఎక్కడో గంటలు కొట్టిన చప్పుడు విన వస్తే, చేతినున్న రేడియమ్ రిస్టువాచీ చూసుకుంది. ఏడుగంట లయిందప్పుడు. ఇంతట్లో ఎవరో తన భుజంమీద చెయ్యి వేసినట్లనిపించి తుళ్లిపడి తిరిగి చూసిందామె.

"ఒక్కర్తేవే ఏంచేస్తున్నావిక్కడ—యీచలిగాలిలో?" అంటూ చనువుగా చిరునవ్వుతో కుశలప్రశ్న చేశాడు జమున్సింగ్.

కళ్ళెత్తి అతడివేపుచూసి, ముసిముసిగా నవ్వి ఊరుకుంది, ఆమె. ఇద్దరూ సర్కస్ మెంబర్లే; ఇద్దరూ పొట్టకోసం కంపెనీలో చేరి నౌఖరీకున్నవాళ్ళే.

తారాబాయి మంచి అందకత్తె. ఆమె నిజమైనకులం యెవరికీ తెలియదు. క్షత్రియ కన్య అని చెప్పుకుంటారు. గుర్రపుస్వారి చేస్తుంది. కత్తితిప్పుతుంది. విలువిద్యలో మంచి ప్రవీణురాలు, తీగెమీద నేర్పుగా బైసికిల్ తొక్కుతుంది; నాట్యంచేస్తూ చిత్రంగా ముగ్గులు వేస్తుంది. ప్రేక్షకులను రంజింపజేసే శక్తులు ఎన్నో ఉన్నాయి, ఆమెవద్ద. ముఖ్యంగా ఆమెరూపం,యౌవనం, పురుషుల నాకర్షించి భ్రమింపజేస్తాయి. కేవలం ఆమెనే చూడడానికి సర్కస్‌కు వచ్చేవాళ్ళెందరో ఉంటారు. అట్టి మోహనాకార మామెది!

జమన్సింగ్ సుమారు 30 యేళ్ళవాడు. మంచి రూపవంతుడు. సర్కస్ విదూషకుడి వేషంవేసి, నవ్వులాలతోను, వికారచేష్టలతోను, చూపరులను మెప్పిస్తాడు. జంతువైద్యం నేర్చిన డాక్టరు. కనుక అడవి మృగాలను చూసే పూచీకూడా అతనిదే. వాటికి తిండిపెట్టినప్పుడాయన దగ్గిరుంటాడు. ఎప్పుడైనా అవి ఆరోగ్యంగా ఉండనప్పుడు, వాటికి మందులు మాకులు యిస్తాడు.

తారాబాయి అంటే సింగుకు ప్రాణం. ఆమెనెట్లాగైన వశపరచుకొని, తనదాన్ని చేసుకుందుకు యెన్నోవిధాల యత్నించేవాడు. కాని తార బలే పెంకెది. అతని హృదయమూ

రాటం తా నర్థం చేసుకోనట్లు నటించేది. జమన్సింగ్ వలె తనకోసం యెం ద రె న్ని వి ధా ల తహతహలాడినా ఆమె కానందమే! వాళ్ళన్ను పిచ్చివాళ్ళను చేసి, ఆడించి తనలో నవ్వుకునేది. పురుష స్నేహితు లందరితోను చనువుగానే ప్రవర్తించేది. మగవాడంటే భయం, బిడియం, లేవామెకు. తానొక స్త్రీ అన్న సంగతి మరచిపోయినట్లు నడుచుకునేది, వాళ్ళతో. పురుషులతో స్నేహం, అగ్నితో చెలగాటమన్న సంగతి ఆమె కింకా విశదం కాలేదు!

తారాబాయిని వెన్నెలలో ఒంటరిగా చూసే సరికి, జమన్సింగుకు వొళ్ళు ఫులకరించింది. వెర్రివెర్రి కోర్కెలతో హృదయం గెంతులాడింది. పట్టరాని మోహావేశంతో కౌగలించుకొని, చెట్లనీడ నామెను ముద్దు పెట్టుకున్నాడు.

"సింగ్, నీకేం మతిపోయిందా?...వొదులు!" అంటూ సిగ్గుతో పెనగులాడింది, తార.

కాని, ఆనందంతో కులుకుతూ గుండె కామెను మరింత గట్టిగా అదుముకున్నాడు సింగ్. తారకు కోపంవచ్చింది. శక్తి కొలదీ పెనగులాడ ప్రారంభించింది. కొప్పులో ఉన్న పువ్వులు నలిగి, క్రింద రాలాయి. ఒళ్ళు వేడెక్కి మొహం యెర్రబడింది. తలతిరిగి కళ్ళు చీకట్లుకమ్ముతున్నట్లు తోచిందామెకు. బుగ్గలు, పెదవులు, కళ్ళు, వక్షం——అన్నీ ముద్దులాడుతున్నాడు సింగు, బలాత్కారంగా. పులిపిల్లవలె రక్కడం ప్రారంభించింది, తార. రోడ్డుమీద దూరంగా యెవరో నవ్వుతున్నట్లు చప్పుడు

వినవచ్చింది. మేడలో దీపాలుకూడా ఆమె అవస్థను చూసి, నవ్వుకుంటున్నట్లేతోచింది, తారకు. చెట్లు,చంద్రుడు,పిట్టలు—లోకం యావత్తూ తన్నుచూసి నవ్వుతున్నట్లనిపించిందామెకు. ఉదాసీనంతో ముఖందించుకుంది. పోట్లాటమాని, బలహీనంగా ప్రాణంలేని బొమ్మవలె వొరిగింది, అతని చేతులలో. దిగులు, ఆశ్చర్యం, జనించాయి సింగుకు. పశ్చాత్తాపం కలిగి, కౌగలి వదలి, బిక్కచచ్చి నిల్చున్నాడు. తల పైకెత్తి ఒక్కక్షణం తీక్షణంగా అతనివేపు చూసిందామె, యేమీ అనకుండా. చేతిరుమాలుతో పెదవులు, బుగ్గలు, తుడుచుకుంటూ, గిరున తిరిగి మేడవేపు వెళ్ళిపోయింది.

ఇదివరలో తారాబాయి యెన్నడూ ఇట్టి అవమానం పొంది ఉండలేదు. తుదకు కంపెనీ మానేజరు సూర్యాభాన్ కూడా ఆమె నీవిధంగా హింసించి యెరగడు. అతగాడంటే తారాబాయికి కొంచెం యిష్టంకూడా. తక్కినవాళ్ళ నెన్ని వేళాకోళాలు చేసినా సూర్యభానును మాత్రం గౌరవంతో చూసేది. అతని ప్రేమ నెన్నడూ తిరస్కరించేదికాదు. సిగ్గుతో కౌగలించుకొని ముద్దులాడుకునేవారిద్దరూ. కాని,...

సూర్యభాన్ చాలా చిన్నవాడు. తారాబాయికంటె రెండుమూడేళ్ళు పెద్దవాడేమో. మీసంకూడా బాగా నల్లపడ లేదు. తండ్రి గతించిన వెనక, సర్కస్ వ్యవహారాలన్నీ తనే చూసుకుంటున్నాడు. వొల్లమాలిన ధనం ఉంది అతనికి. అన్ని విధాలా స్వతంత్రుడే. తారాబాయిని పెళ్ళాడి, సర్కస్‌గౌరవ

వదులుకొని, హాయిగా ఆమెతో సుఖించాలని అతని ముచ్చట. కాని ధైర్యంగా ఆమెతో తన మనోభీష్టం చెప్పడానికి సిగ్గు!

సూర్యాభాన్ అంటే యిష్టమే కాని, బాదల్చంద్‌ను చూస్తే, తారాబాయికి మతిపోయేది. అతన్ని తల్చుకున్నంత మాత్రాన, హృదయం ఆనందంతో సందడించేది. అర్థంకాని కోర్కెలతో మనసు కలవరపడేది. నిజమైన ప్రేమంటే, ఆమె కిదివరలో అంతగా అనుభవానికి రాలేదు. కాని, యిప్పుడిప్పుడు చాలా సంగతులు బోధపడుతున్నాయి. ఏదో స్పష్టంగా తెలియని బాధతో మనసు అప్పుడప్పుడు కలతపడడం, ఏవో పిచ్చిపిచ్చి వాంఛలతో గుండె బరువెక్కడం, నిద్రలో తియ్యో తియ్యని కలలు వచ్చి తృప్తి తీరకమునుపే మెలకువ రావడం, తిండి తిన్నగా హితవుకాకపోవడం, మొదలయిన అవలక్షణాల వలన తనలో జనించిన రుగ్మతను గుర్తించుకుందామె. బాదల్చంద్‌ను మనసారా వలచి, ప్రేమతత్వం అర్థం చేసుకుంది కొంతవరకు.

బాదల్చంద్ పహిల్వాన్; అసర్కసుకు ఆయువుపట్టు వంటివాడు. రూపంలో మన్మథుడు కాకపోయినా, కంపెనీకి పేరు ప్రతిష్ఠలు సంపాదించినవాళ్ళలో అతడు ముఖ్యుడు. వల్లగా ఉన్నా, మెలితిరిగిన కండలతో అతనిశరీరం మెరిసేది, బలంతో. పెద్దకళ్ళు, తరుచైన మీసం–గంభీరంగా ఉండేదతని ముఖం. మనిషి చిన్నవాడే. పాతికేళ్ళుంటాయి. మోటైన గొలుసులు తెంచడం, ఛాతీమీద పెద్దపెద్ద బరువైన రాళ్ళు పెట్టించుకొని సుత్తులతో పగలగొట్టించడం, మొదలైన పనులు

గాక, అడవి మృగాలతో వింతవింత వినోదాలు చేసేవాడు పెద్ద ఇనపగజాల బోనులో పులులు, సింహాలు, ఆవులు, మేకలు, కోతులు——అన్నిటినీ ఒకచోట చేర్చి, వాటిచేత అద్భుతమైన పనులు చేయించేవాడు. ఒకే పళ్ళెంలో అన్నిటికీ ఫలహారాలు పెట్టి తినిపించేవాడు. సింహంచేత తుపాకి పేలించేవాడు. పెద్ద పులులను దుమికించేవాడు, మండుతూవున్న చక్రాలలోనుండి. సాధారణంగా ప్రతీ సర్కస్‌వాళ్ళూ చూపించే చిల్లరవినోదాలు గాక, పెద్దపులులతోను, సింహాలతోను, కొన్నికొన్ని భయంకర మైన 'ఫీట్లు' చేసి చూపించేవాడతడు. బోను గీను యేమీ లేకుండానే "రాజా" అనే పెద్దపులిని బయటకి తెచ్చి, గుర్రం మీదవలె దానిమీద స్వారీచేసేవాడు రంగస్థలంలో! ప్రేక్షకులు భయంతో ఊపిరి బిగపట్టుకొని చూసేవారాచిత్రాన్ని. మనిషితోవలె పులితో కుస్తీపట్టి, దానితో కిందామీదా పడి దొర్లేవాడు. అమాంతంగా దాన్ని భుజంమీద యెత్తుకొని మోసేవాడు. నిర్భయంగా పులినోట్లో తలదూర్చి తీసేవాడు. చూసేవాళ్ళకు కంపం పుట్టించేది, ఆదృశ్యం!

ఎన్నోసార్లు తారాబాయి అతన్ని బ్రతిమాలుకుంది, ఆఫీటు మానవలసిందని. "పిరికిదానా!" అంటూ ఆమె నెగతాళిచేసి, నవ్వి, ఊరుకునేవాడు బాదల్చంద్.

తారాబాయి జమన్సింగ్‌తో కలహించి, ముఖం ముడుచుకొని మేడమీదకి వెళుతున్నప్పుడు, బాదల్‌చందా మెకు యెదురుగా వస్తున్నాడు. మెరుపుదీపం వెలుగులో ఆమె ముఖవైఖరి కనిపెట్టి తుళ్ళిపడ్డాడతడు. పలకరిస్తే బద్దలు

చెప్పకుండా ఆమె తనగదిలోకి వెళ్ళిపోయి, తలుపులు మూసు కుంది. కాని లోనుండి గడియవేసుకునే లోపున, బాదల్చంద్ చప్పున లోపలికి వచ్చి ఆమె చెయ్యిపట్టుకున్నాడు.

అత డెన్నివిధాల ప్రార్థించి అడిగినా, ఆమె మొదట యేమీ చెప్పలేదు కాని, క్రమంగా ఉన్న దున్నట్లుగా జమన్సింగ్ ప్రవర్తనను తెలియజేసింది. శిరము ముద్దాడి, గుండెమీద కామెను వాల్చుకొని, ఓదార్చాడు బాదల్చంద్. సహజంగా సింగుమీద అతనికి పట్టరాని కోపం వచ్చింది.

మరికొంత సేపటికి కొరడా పట్టుకొని సింగుకోసం వెతు క్కుంటూ బయలుదేరాడు. సింగును చూసేసరికి వెర్రికోపంతో వొళ్ళు మరచిపోయాడు, బాదల్చంద్. కొరడాతో అతడిని కుక్కను తన్నినట్లు చావగొట్టి కసి తీర్చుకున్నాడు.

"ఈమాటు దానివేపు కన్నెత్తి చూశావంటే, పీక నులిపి చంపేస్తాను నిన్ను. జాగ్రత్త!" అని పళ్ళుకొరుకుతూ, తాటించాడు కూడా.

బాదల్చందు నెదిరించడం మదపుటేనుగుతో పోట్లాడడ మన్నమాట. ఆసంగతి తెలిసే ఊరుకున్నాడు జమన్సింగ్. కాని దెబ్బలు తిని పగ తీర్చుకోకుండా ఊరుకునే నైజం కాదతనిది. మనసులో రగిలే మంటను మనసులోనే అణచు కొని తరుణం కొఱకు నిరీక్షిస్తూ మిన్నకున్నా డప్పటిమట్టుకు. పగ సాధించుకుందుకు మార్గాలాలోచిస్తూ, రాత్రిల్లూ నిద్ర పోక తనగదిలో యిటూ అటూ పచారు చేశాడు. గ్లాసుమీద

గ్లాసు బ్రాంది తాగేడు. తారాబాయిమీద అతనికి గల మోహమంతా ద్వేషంగా పరిణమించింది. బాదల్చంద్ మీద కసితీర్చుకుందుకు సరియైన ఉపాయమేదీ తోచక, మెదడు వేడెక్కి పిచ్చెత్తినట్లయిందతనికి. తీవ్రంగా ఆలోచిస్తూ తల నొక్కుకున్నాడు చేతులతో. కళ్ళు మంట. నరాలు పీకు. గుండెలో భారం. కొరడాదెబ్బలకు వొళ్ళంతా నొప్పి. సారా మత్తుకు కడుపులో యేదో వికారం. కోపం, మోహం, తాపం, అవమానం, అన్నీ కలిసి అతని హృదయాన్ని నలిపి, పీడించి, దహించి పిప్పిచేశాయి.

ఆమర్నాడే సర్కస్ ప్రారంభమవుతుందన్న సంగతి జ్ఞాపకం వచ్చింది సింగుకు. యేఊళ్ళోనూ నాలుగాటలకన్న అధికం వెయ్యడం, ఆకంపెనీవాళ్ళకు మామూలు లేదు. "ఈ ఊరునుండి కదిలే లోపునే పీడపనిపట్టించితీరాలి" అని మనో నిశ్చయం చేసుకున్నాడు సింగు.

మొదటి రాత్రితో సర్కస్వాళ్ళ కీర్తి ఊరంతా వ్యాపించింది. వాళ్ళ ప్రదర్శనం చూడతగినదని అందరికీ విశద మైంది. ఎవరినోటవిన్నా, తారాబాయిపేరు, బాదల్చంద్ పేరు వినవచ్చేవి. ఈర్ష్యతోను, ద్వేషంతోను, వొళ్ళు మండు కొచ్చింది జమస్సింగుకు. కాని వాళ్ళనణిచే సాధనం కాన రాలేదు. నిద్రాహారాలుకూడా తిన్నగాలేక, జమస్సింగు కెప్పుడూ ఒకటే ఆలోచన—బాదల్చంద్ మీద కసితీర్చు కోవడ మెట్లానా, అని.

జమన్సింగును తాను గట్టిగా శిక్షించిన సంగతి బొాదల్బంద్ నవ్వుతూ తారాబాయితో చెప్పినప్పుడు, సంతోషం వెలిబుచ్చడానికి బదులుగా నిట్టూర్పు విడిచిందామె.

"ఛా, మనిషంత మనిషిని అమాంతంగా మీదపడి కొట్టడం తప్పుకాదూ? ఇట్లా తొందర పడతావని తెలిస్తే, అసలు నీతో యేమీ చెప్పకనే పోదును."

"నిన్నట్లా అవమానపరచినందుకు వాడిని నిలువునా చీల్చెయ్యాలనిపించింది నాకు. ఇంకా వస్తాయించి ఊరుకున్నా నంతటితో! సంతోషించు——" అన్నాడు బొాదల్బంద్.

"సింగు చాలా కార్పణ్యం గల మనిషి. నీచేత దెబ్బలు తిని, ఊరుకుంటాడనుకోకు. పాముపగ, వాడిది!" అన్నాదామె.

"ఏడిశాడు." అంటూ బొాదల్బంద్ విరసంగా నవ్వి, "తారా, నువ్వు వట్టిపిరికిపిల్లవు సుమా!" అంటూ ప్రేమతో ఆమె నెత్తుకొని, వక్షాని కదుముకొంటూ, ముద్దులతో నోరు మూశాడు.

"బలం ఉన్నదని మోటసరసం కూడదు!...నొప్పి కాదూ, అట్లా నొక్కేస్తే?"

* * * *

రెండోనాటి ప్రదర్శనానికి సర్కస్ డేరా తొమ్మిదిగంటలు సరికే నిండిపోయింది. టిక్కెట్లు దొరకక, కొందరు ఆశాభంగులై యిళ్ళకు మరలవలసి వచ్చింది.

తీగమీద తారాబాయి తన చాకచక్యాలన్నీ చూపి, ప్రేక్షకులను మెప్పించి, రెండుబంగారుపతకాలు సంపాదించింది. చప్పట్లతో డేరా ఊగిపోయింది. సభాసదుల సన్మానంపొంది, ఆమె లోనికి వెళ్ళిపోయిన పిమ్మట, మానేజరు సూర్యాభాన్ ఆమెను సమీపించి, షేక్ హాండ్ చేసి, తన సంతోషం వెల్లడి చేస్తూ, హెచ్చుగా పొగడి పొంగవేశాడు.

పిదప, ఆమెను తోడ్కొని తన గుడారంలోకి తీసుకొనిపోయి, ఫలాహారాలు మేపి, ఒక గ్లాసు ఛాంపెనీ తాగించాడు; ఆనందంతో కులుకుతూ తారాబాయి తన కొరగంటి చూపులతోను, ముసిముసి నవ్వులతోను కృతజ్ఞతను సూచించింది, అతని దయకు. ఆమె మోహనరూపానికి పరవశుడై అట్టే ఆమె ముఖంవేపు చూస్తూ, మీద చెయ్యివేసి కూచున్నాడు సూర్యాభాన్.

"తారా, ఈవాళ నీపరిదర్శనం, నీచక్కదనం అద్భుతంగా ఉన్నాయి!"

ఇద్దరూ లేబ్రాయమువారు. రూపవంతులు. ప్రియులు. సర్కస్ గొడవ మరచిపోయి ప్రియాలాపాలలోపడ్డారు. నవ్వులు; ముద్దులు, కౌగిలింతలు, నిట్టూర్పులు—ఒకరికౌగిట్లో ఒకరు వొళ్ళుమరచి కళ్ళు మూసుకున్నారు.

బాదల్చంద్ ఆ డేరాకు సమీపంగా యెక్కడికో వెళుతూ, అప్రయత్నంగా లోనికి తొంగిచూశాడు. మానేజరు

కంఠాన్ని కౌగలించుకొని, ప్రేమతో అతనికి ముద్దులిస్తూవుంది తార!

కోపంతోను, 'జెలసీ'తోను హృదయం మండిపోయింది, బాదల్సిందుకు. తన నెంతో ప్రేమిస్తూ ఉన్నట్లు చెప్పిన తార యీవిధంగా ద్రోహం చేస్తుందని అతడెన్నడూ అనుకోలేదు—కలలోనైనా. అతని కేమీ అర్థంకాలేదామె ప్రవర్తన.

"వాడావిధంగా మీద చెయ్యివేస్తే యెట్లా సహించు కుంటూవుంది తార? ఒళ్ళు కాలినట్లనిపించదూ? లేక..."

అధికం ఊహించుకుందుకు కూడా యిష్టపడలేదు, అతని మనస్సు!

జమన్సింగును కొట్టినట్లు కాదు! సూర్యాభాను నెట్లా యెదిరించడం? కొండతో ఢీకొని పోట్లాడితే గొట్టిపోతుకే ముప్పు,—తల పగిలి చస్తుంది. ఏంచెయ్యడానికీ పాలుపోలేదు, బాదల్సిందుకు. దుర్భరమైన యీర్ష్యతో బాధపడ్డాడు. తారా బాయి ననక, సూర్యాభాను ననవలసిన పనియేముంది? కాని ఆమెమీద బాదల్సిందుకు గల అధికారమేమిటి? అన్నిటికీ స్వతంత్రురాలామె. కాని,........

తల గిర్రున తిరుగుతూ వుంది—నిద్రలో నడిచే వాడి వలె తూలిపోతూ అక్కడినుండి వెళ్ళిపోయాడు బాదల్సింద్.

నాడు సర్కస్‌లో తాను చేయవలసిన పనులలో యేమీ ఉత్సాహంలేకుండా నతనికి. ఏదో విధిలేక, మొక్కుతీర్చు

కున్నట్లు నెరవేర్చాడు, కొన్నిఫీట్లను. అడవి జంతువులచేత వినోదాలు చేయించినప్పుడు, అతని కత్యంతప్రియమైన 'రాజా' అన్న పులి అల్లరి ప్రారంభించింది. చెప్పినమాట వినకుండా బద్ధకించిమూలిగేది, యజమానిని సమీపించడానికి ఉత్సాహం వెలిబుచ్చడానికి బదులు, గురిపెట్టి దూరదూరంగా జరిగేది. వెర్రికోపం వచ్చింది బాదల్చందుకు. లోకమంతా అతన్ని హఠాత్తుగా ద్వేషించి, హింసించి, పరాభవించడాని కుద్యమించినట్లు తోచిందతనికి! మనసిచ్చి ప్రేమించిన తారా బాయి తుదకు మోసంచేసి, అతని ప్రేమను అవమాన పర చింది. ఇప్పుడీపులికూడా అతని స్నేహాన్ని అగౌరవిస్తూవుంది. ఇన్నివేలమంది చూస్తూవుండగా, అతనిఖ్యాతికి భంగంతెస్తూ, అసందర్భంగా ప్రవర్తిస్తూవుంది 'రాజా'. అవమానం సహించు కోలేక పోయాడతడు. తాగినవాడివలె వొళ్లుమరచిపోయి, కొరడాతీసుకొని, పులిని కొట్టడం ప్రారంభించాడు. ప్రేక్షకు లకు భీతి పుట్టింది. కాండుర్ కాండుర్ మని పులి అరుస్తూ ఉన్నప్పుడల్లా భూమి వణుకుతున్నట్లనిపించేది. కొరడా చప్పు డుతో దేరా మారుమోగింది. ఎన్ని దెబ్బలుతిన్నా, పులి తన మూర్ఖతను వదలలేదు. కోరలుచూపి, కస్సుమని యెదురు తిరిగింది.

'రాజా' సామాన్యమైన పులికాదు. తెలివితేటలు, చురుకుదనం, హృదయం, గల అపూర్వమైన జంతువు. బాద ల్చందు నెంతో ప్రేమిస్తూ, మిక్కిలి అణకువతోను, మర్యాద తోను మెసలేది, అతనివద్ద. నాడు మామూలుకు వ్యతిరేకంగా

ప్రవర్తించడానికి, తగిన హేతువేదో ఉండవచ్చునని గ్రహించలేక పోయాడు, బాదల్బంద్. సాధారణంగా సర్కస్‌వాళ్ళు సింహాలకు అప్పుడప్పుడు నల్లమందు తినిపిస్తూ ఉంటారు. మత్తు చేత వాటి ఘాతుకస్వభావం కొంతసేపైనా అణగి ఉంటుందని అభిప్రాయం కాబోలు! 'రాజా' శరీరతత్వం యెట్టిదో కాని, నల్లమందువాసనే పడేదికాదు దానికి. బలవంతం మీద యెప్పుడైనా తినవలసివస్తే, ఆరోజల్లా పిచ్చెత్తినట్లు ప్రవర్తించేది. జమన్సింగుకు దాని ప్రకృతి తెలుసు. నల్లమందు మాత్రం యెన్నడూ దానికి పెట్టనిచ్చేవాడు కాడు. కాని, ఆరోజున ఉద్దేశపూర్వకంగా మాంసంలో నల్లమందు తనే స్వయంగా కలిపి 'రాజా'కు పెట్టించాడు. కడుపులో వికారం పుట్టి, వమనం చేసుకుందుకు యత్నించింది పులి. జమన్సింగ్ నీళ్ళలో యేదో మందుకలిపి మళ్ళీ తాగించాడు పులిచేత. 'రాజా'కు ఒంట్లో సరీగా లేదన్న సంగతి మానేజరుకు కూడా చెప్పలేదాయన.

రంగస్థలంలోకి వచ్చి మనుషులను, దీపాలను చూసే సరికి, 'రాజా'కు గిర్రున తల తిరుగుతూ ఉండెను. మత్తుగా, బద్ధకంగా, ఉండెను, ఒంట్లో. 'ఈవాళ నాకు సరిగాలేదు. నన్ను బాధపెట్టకు.' అని దీనంగా వేడుకొని గుర్రుతో తెలియజేసింది, యజమానికి. కాని బాదల్బంద్ దాని ప్రార్థన వర్ధం చేసుకునే స్థితిలో లేకుండెను.

ఎన్నడూ శిక్ష యెరగని జంతువుకు వీపుమీద దెబ్బలు పడగానే, కష్టం తోచింది. పౌరుషం కలిగి 'రాజా' యెదురు తిరిగింది. అమాంతంగా మనిషిని చీల్చేస్తుందా అన్నంత

ఆగ్రహం చూపింది, కళ్ళలోను కోరలలోను. ప్రేక్షకులు భయపడి గొల్లుమన్నారు. మానేజరు ముందుకువచ్చి, ఫరవా లేదని వాళ్ళకు ధైర్యం చెప్పి అల్లరి, కేకలు కూడదని మందలించాడు.

బాదల్చంద్‌ను, పులిని, భయదృష్టులతో చూస్తూ దగ్గరగానే నిల్చుంది తారాబాయి. అతని కపాయంరాకుండా కాపాడమని దేవుణ్ణి వెయ్యివిధాల మొక్కుకుంది మనసులో. ఏదైనా ప్రమాదం సంభవిస్తే, వెంటనే పులిని చంపడానికి ప్రక్కనే ఇద్దరు భటులు నిల్చున్నారు, తుపాకులు పట్టుకొని.

రౌద్రాకారంతో పంజా తెరచి, వ్యాఘ్రము తన్నెదిరించడానికి వచ్చినప్పుడు బాదల్చంద్‌కు గుండెలో దడపుట్టింది. అప్రయత్నంగా చేతిలోవున్న కొరడా క్రిందికి జారిపోయింది. "రాజా!" అని బిగ్గరగా అరచి, నిస్సహాయుడై నిల్చున్నాడు - చావుకు సిద్ధపడి.

అతని కేకతో మెలకువ వచ్చింది పులికి. రౌద్రం అణగి పశ్చాత్తాపంతో నిల్చుంది, అ త ని పా దా లు మూచూస్తూ! ధైర్యంగా మెడమీదతట్టి వీపునిమిరి 'రాజా'ను బుజ్జగించాడప్పుడు బాదల్చంద్. అతని కరస్పర్శవలన మంత్రింపబడినట్లు పిల్లివలె లొంగిపోయింది, పులి. అద్భుతమైన ఫీట్లు చేయించాడప్పుడు దానిచేత. ఊపిరి బిగపట్టుకొని చూస్తూ, ప్రాణాలులేని ప్రతిమలవలె కూచున్నారు ప్రేక్షకులు. కిక్కురుమన్న ధ్వనికూడా లేక, డేరాఅంతా నిశ్శబ్దం!

పన్నెండు గంటలు కావచ్చింది. ఇంకో ఐదు నిమిషా లలో ఆట ముగుస్తుంది. 'రాజా' చేత ఆఖరుఫీటు చేయించ డాని కుద్యమించాడు బాదల్చంద్. కాని పులి తన అయిష్ట తను సూచించింది.

అలసి, రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు బాద ల్చంద్. ఆక్షణంలో యెదురుగా నిల్చున్న తారాబాయిని చూశాడు. ఆమెదృష్టి అంతా తనమీదనే ఉన్నట్లు విశద మైందతనికి. ఆభ్రమరనేత్రాలనుండి వెలువడిన ప్రేమకిరణా లతని హృదయాన్ని దూసుకొపోయి, మనసును కలవరపెట్టి నవి. దీర్ఘమైన నిట్టూర్పు విడచి, ఆమెనుండి దృష్టి మరల్చు కున్నాడు.

పులిని కొంతసేపు బుజ్జగించి, నోరు తెరవమని ప్రోత్స హించాడు. దవడలు బిగపట్టి మూర్ఖంగా నిల్చుంది 'రాజా'. తల పైకెత్తి జిగజిగలాడే పచ్చని మెరుపుకళ్ళతో అట్టే చూసిందతనివేపు, దీనంగా!... "వొద్దు. నన్ను బలవంతపెట్టకు. నాతల తిరుగుతూవుంది. తెలివితప్పి, యేమక్రమంచేస్తానో అని దిగులుగావుంది నన్ను క్షమించి, నేటికి విడిచిపెట్టు." అన్న భావం వెలిబుచ్చింది, ఆ చూపు లో! బాదల్ చంద్ మన్నించలేదు దానిప్రార్థనను. దవడమీద చరిచి, నోరు తెరవమని ఆజ్ఞాపించాడు.

విద్యుద్దీపాల కాంతిలో తళతళ మెరిశాయి కోరలు. మృత్యుద్వారంవలె తెరువబడిన పులినోట్లో చప్పున తల

దూర్చాడు బాదల్చంద్. పెట్టెకప్పు మూతపడినట్లు దవడలు మూసుకొనిపోయాయి 'రాజా'కి. వెచ్చని రక్తంతో నోరు తడిసింది దానికి. అదిరిపడి కళ్లువిప్పి, నోరు తెరచింది. కంఠం కత్తిరించుకొనిపోయింది, బాదల్చంద్‌కు. స్మృతిలేక క్రింద పడ్డాడు. జరిగిన ప్రమాదమప్పుడు విశదమైంది పులికి. దుఃఖంతో అతని ముఖంచూస్తూ, కన్నీరు విడిచింది, రాజా! రెండుసారులు తుపాకి మోత మారుమోగింది, డేరాలో. ఒక్కసారి మూలిగి, గుండెనుండి వరదలుగా రక్తం కార్చు కుంటూ, వెంటనే నేలకొరిగింది పులి. గొల్లుమన్నారందరూ!

బాదల్‌చందును రంగస్థలమునుండి లోనికి తీసుకొని పోయినారు. పెద్ద పెద్ద డాక్టర్లువచ్చి తమ శక్తిసామర్థ్యాలన్నీ వినియోగించారు. కాని, లాభం లేకపోయింది.

నెత్తీ నోరూ కొట్టుకొని, అతని మృతకళేబరంమీద పడి యేడ్చింది తారాబాయి. సర్కస్ మెంబర్లందరూ కంట తడిపెట్టుకున్నారు. మానేజరు సూర్యాభాన్ తారాబాయిని మెల్లగా లేవనెత్తి, పడిపోకుండా ఆమెను తన వక్షంమీదికి వాల్చుకొని, శిరం నిమురుతూ, జేబురుమాలుతో కన్నీళ్లొత్తి ఓదార్చాడు.

---

# హాస్యము.

ఈ హ్యూమర్ అనేది స్వతహాగా మనిషిలో ఉంటేనే గాని, వ్రాతలో రాణించదు. హాస్యం చెప్పడం ప్రతీవాడికీ చాతవుతుందా? అదిగాక, యెదటివాడు మనమాటలకు నవ్వేడంటే, కేవలం ఆమాటల్లో గల హాస్యరసం గ్రహించి, సంతోషించి, నవ్వేడని అనుకోకూడదు. ఏకారణంచేతనైనా, నవ్వ వచ్చును. ఏమంటే, నవ్వు నాలుగువిధాలు. నవ్వొచ్చి నవ్వడం—నవ్వకుంటే బాగుండదని నవ్వడం—నవ్వాలికాబోలని నవ్వడం—యేడవలేక నవ్వడం.

సాధారణంగా యితరులకు నవ్వుకలిగించేది మనలో ఉండే తెలివితక్కువతనం; అందుకనే, పసిపిల్లలు, పిచ్చివాళ్ళు మనని సులభంగా నవ్వించగలరు. కాని, పిచ్చిపిచ్చి వ్రాతల వలన పాఠకులను మెప్పించి, నవ్వించాలని యత్నించడం, కవికి గొప్పకాదు. మన పూర్వకవుల పుస్తకాల్లో హాస్యరసం అంతగా కనిపించక పోవడానికి యిదేకారణం కావచ్చును. శోకం, భక్తి, శృంగారం—ఇలాటి రసాలు ప్రతిగ్రంథంలోనూ కనిపిస్తాయి. కాని, హాస్యరసం అనేది యేపుస్తకం పిండినా, పదిబొట్లు రాలదు. కథలో హాస్యరసం యిమడ్చలేక, మన కవులు కొందరు వేరే ఒక విదూషకుని నిర్మించి, ప్రబంధాల్లోనూ, నాటకాల్లోనూ దూర్చారు.

ఇంగ్లీషుకవుల వ్రాతల్లో స్ఫురించే హాస్యరసం యింత కంటే యింపుగాను, నాజూకుగాను ఉంటుంది. ఇటీవల మన ఆంధ్రకవులుకూడా తక్కిన రసాలతోపాటు, హాస్యరసానికి సహితం కొంతగౌరవం యిస్తున్నారు. కాని కేవలం హాస్య రసమే ప్రధానంగాగల గ్రంథాలు చాలా అరుదు.

ఇందుకు కారణంయేమిటి? మన కవులకి నవ్వించడం చాతగాకనా? లేక, చాతనయికూడా యీరసంలో ఉండే మహత్తును గ్రహించలేకనా? లేక, 'నవ్వు నాలుగువిధాలచేటు' అన్న పెద్దలవాక్యం యెరిగి, నవ్విస్తే పాపం అనే ఊహచేతనా? కవులకే కాదు, యెవరికైనాగాని ఒకర్ని యేడిపించడంకంటె, నవ్వించడమే ఘనత. కాని, యేడిపించడం సుళువని తోస్తుంది. అందుకనే, కొందరుకవులు ఒకర్ని యేడిపించి, ఆమూలంగా మరొకర్ని నవ్వించాలని యత్నిస్తారు. దీనినే వెకలిహాస్యం, వెక్కిరింత అంటారు.

పరిశుద్ధమయిన హాస్యరసం అనేది, తేటగా, శుభ్రంగా, తియ్యగా అమృతంవలె ఉండాలి. అంతేకాని, అరవకాఫీలాగు నల్లగా చేదుగా కొందరికి, ఘాటుగా రుచిగా కొందరికి, ఉంటే లాభంలేదు. అందరికీ ఒకేవిధమైన రుచి, ఆనందం కలుగ జేసేదే నిజమైన హాస్యం.

హాస్యం అంటే కొందరు అర్థంచేసుకోలేక, మోటా సరసంలోకీ, వెక్కిరింతలోకీ దిగుతారు. భాగోతులు, హరి కథలు చెప్పేవాళ్లు, సురభినాటకాలలో హాస్యగాడివేషం

వేసేవాళ్ళు—వీళ్ళంతా యిదేమచ్చు. ఇంగ్లీషు గ్రంథాల్లో 'హ్యూమర'నీ, 'బఫూనరీ' అనీ, 'ఐరనీ' అనీ, 'సెటైర'నీ, హాస్యం అనేక విధాలుగా గోచరిస్తుంది. మన తెలుగు పుస్త కాలలో యిన్నిరకాలు కావు సరేసరికదా, మెచ్చుకోతగిన రకం యేదీ కనిపించదు.

కొంతవరకు వీరేశలింగం పంతులుగారి పుస్తకాల్లోనూ, చిలకమర్తి ఆయన పిట్టకథలలోను, పానుగంటి పంతులు నాటకాల్లోను, హాస్యరసం అక్కడక్కడ చిలికివున్నది. ఒక్క 'కన్యాశుల్కం' మాత్రం హాస్యరసగ్రంథాలలో సుప్రసిద్ధమై ఉన్నది. అప్పారావుపంతులకు హ్యూమరనేది స్వతహాగా అలవడినట్లుంది. ఆమోస్తరుగా కడుపు చక్కలయేటట్లు నవ్వించే పుస్తకం తెలుగులో కాదు సరేకదా, మరేభాషలో నైనా వున్నదా అని సందేహించవలిసొస్తుంది. వెంకటరాయ శాస్త్రీగారి ప్రతాపరుద్ర నాటకంలోకూడా హాస్యరసం మెండుగానే స్ఫురిస్తుంది. కొంతకాలం క్రిందట బుద్ధిరాజు ఈశ్వరప్పపంతులుగారేవేవో చిన్న చిన్న హాస్యగ్రంథాలు ప్రకటించియుంఢిరి. మంచి తమాషాగా ఉండేవి. కొందరిప్పు డిప్పుడు యేవేవో పిట్టకథలు, ప్రహసనాలు, టిట్ బిట్ సూ, వ్రాస్తున్నారు. కాని అవి లిటరేచర్‌లో యెంతమట్టుకు నిలుస్తాయో నిలకడ మీాదకాని తెలియదు.

తెలుగు పుస్తాకాలలో హ్యూమరనేది కొరతగా వుండ డం విచారకరమైన సంగతేకాని అంతకంటె విచారకరమైన సంగతేమిటంటే, కవులు హాస్యం వ్రాయబోయి అసందర్భాలు

రాయడం! నవ్వ్వతాలు నాజూకుగా ఉంటేనేముద్దు. లేకుంటే రోత. ఆనందించి నవ్వ్వడానికి బదులు అసహ్యంవేసి కవిని తిట్టాలనిపిస్తుంది. జ్ఞానంలేని పసిపిల్లలకు బూతుమాటలు నేర్పి నవ్వ్వకొనే మూర్ఖులుంటారా అనుకోకూడదు. అంతకంటే అన్యాయంగా వుంటుంది కొందరుకవులు హాస్యం.

మాపురాణం శాస్త్రిల్లుగారితో ఒకనాడీహాస్యరసం గూర్చి ప్రస్తావిస్తే ఆయన కాళిదాసు శ్లోకాలేవో చదివి అర్థం చెప్పడం ప్రారంభించాడు. నాకు సంస్కృతంలో యేమీ ప్రవేశం లేనందున "అయ్యా, శాస్త్రిగారూ, తమరు చదివిన తెలుగు గ్రంథాలలో యేవైనా ఉదాహరణలు తీసి చదవండి" అని అడిగాను.

కొంతసేపాలోచించి, ఆయన యేవేవో తమాషా పద్యాలు చదివారు. కొన్ని కొంచెం మోటుగాను, కొన్ని కేవలం పచ్చిగాను, కొన్ని నిజంగా సరసంగానూ, ఉన్నాయి. 'ఇవేగ్రంథంలోవి చెప్మా?' అని నేను తటపటాయిస్తున్నానని అనుకొని, ఆయన, "ఇవి చాటువులండి. మన పూర్వకవులు చెప్పినవే అంటారు. కాని యేపద్యం యేకవి చెప్పిందో, ప్రమాణం చూపించగలరా అంటేమాత్రం, కష్టం. ఉప్పెనగా నవ్వొచ్చేవన్నీ తెనాలికవివే అంటారు. 'నానాసూనవితాన వాసనల,' అన్న ముక్కుమీది పద్యంలాగ, 'తిమ్మన్న దేనా' అంటే, తిమ్మన్నదికాకూడదా, అనుకోవాలి" అని సమాధానం చెప్పేడు.

"చాటుపద్యాలమాటకేంలెండి. పొడుపుకథపద్యాలు, ఆశుధారలు, సమస్యలు పూర్తిచేస్తూ చెప్పిన పద్యాలు, పాండిత్య వైరంచేత కవులు ఒకరినొకరు తిట్టుకుంటూ వ్రాసిన పద్యాలు, ప్రభువులు సత్కరించనప్పుడు కసిచేత వాళ్ళను దూషిస్తూ, చంద్రరేఖా విలాపంవంటి పుస్తకాలు రాసిన కవుల మోటుపద్యాలు, 'దీని భావమేమి తిరుమలేశ' అన్న పద్యాలు,—వీటిమాట నేనడగలేదు. ఉత్తమ గ్రంథాలని మీరు భావించే పుస్తకాలలో ఉండే చమత్కారమైన పద్యాలు తీసి చదవండి; పకపక నవ్వించేవిగాని, చిన్నచిన్న చిరునవ్వు కలుగజేసేవి కాని."

"ఉత్తమగ్రంథాలలో నవ్వుతాలుంటాయా అండి!" అన్నాడు శాస్త్రుల్లు.

"ఎందుకుండకూడదు? ఇంగ్లీషులో షేక్స్పియరనే మహాకవి గొప్ప గొప్ప విషాదాంత నాటకాలలో సహితం హాస్యరసం కురిపిస్తాడు." అని చెప్పేను.

నవలలు, నాటకాలు, వీటిలో కవికి ఉండే స్వేచ్ఛ ప్రబంధాలలో ఉండదు. పురాణాలలోను ప్రబంధాలలోను హాస్యరసం యిమడడానికే చోటుండదు. ఎంతసేపూ, కవన గాంభీర్యం అనేది పదగుంభనలోను, ప్రకృతి వర్ణనలోను, విశదపడాలి.

"అంతేనా? కథాకల్పనో? అందులో కవికి వొల్లమాలిన స్వేచ్ఛవుందిగా!" అన్నాను.

"మనవాళ్ళు మంచి మంచి కథలు కల్పించుకొని ప్రబంధాలు రాశారనుకున్నారా యేమిటి? మన తెలుగుకవులు కథకోసం యెన్నడూ శ్రమపడి యెరగరు."

"అయితే తెలుగులో స్వతంత్రగ్రంథాలే లేవనా తమ అభిప్రాయం?" అని అడిగాను.

"ఇంచుమించు అలాగే చెప్పవలసివస్తుంది. నాగరంలో లేని కథయేదీ మనకవులు యెత్తుకోలేదు. పురాణాలయితే నేమి, ప్రబంధాలైతేనేమి, అన్నిటికీ మూలం సంస్కృతం".

"కావచ్చును. కథయేదైనా, రచనావిధానంలో కవి చమత్కారం చూపవచ్చును కదూ?"

"నిజమే లెండి. కాని మన పురాణగ్రంథాలన్నీ భక్తి ప్రధానమైనవి. కాబట్టి చోరవచేసి, కవులు హాస్యరసం నాటిలో యిరికించలేదు. నవ్వులాలురాస్తే, దైవభక్తి అనేది నిలుస్తుందా?" అన్నాడు శాస్త్రుల్లు.

"అదికాదు. దేవుళ్ళనీ, దెయ్యాలనీగూర్చి వ్రాసేటప్పుడు హాస్యంచెప్తే, బెడిసికొడుతుందని భయంచాత కాబోలు!...పోనీ, ప్రబంధాలమాట చెప్పరేం?"

"అవైనా, అన్నీ ఒకేమాదిరివిగా ఉంటాయి. కథ యేదైనా, కట్టుబొట్లు అధికం గనుక, ఒకకవినిచూసి యింకో కవి, ఆకవినిచూసి మరోకవి, అందరూ ఒకటే ఫక్కీ అవలంబించారు. అంచాతనే, వీరారు కోరిన చమత్కార పద్యాలు

యెక్కడో కాని కనిపించవు. ఒరిజినాలిటీ లేనప్పుడు హాస్యానికి అవకాశం యేదీ!" అని శాస్త్రుల్లు తలవూస్తూ, పెదిమె విరిచాడు.

"స్వాతంత్రించి, క్రొత్తదార్లు తొక్కి, చమత్కారంగా రాసిన కవులు లేరన్నమాటా?" అని నవ్వుతూ అడిగాను.

"లేరండి! అందుకు కారణాలు లేకపోలేదు. ఇప్పుడు చూశారా, ఒక ప్రబంధం చెయ్యాలంటే మనకవులు ముఖ్యంగా ఆలోచించిన దేమిటి? 'ఇది యేరాజుకు అంకితంగా చెప్పాలి?' అని. అంతే. కథ కల్పించుకోవలసిన అగత్యంలేదు. పురాణాల్లోను, సంస్కృత నాటకాల్లోను, కావలసినన్ని కథలున్నాయి. ఇక రచనావిధానం పూర్వులు స్థిరపరిచే వుంచారు. కొన్ని యిష్టదేవతా పద్యాలు, గురుస్తుతి, ఆవెనక కథాప్రారంభం. అనగా, పురవర్ణన—రాజుగారి కీర్తిప్రభావము—వసంతఋతువర్ణన—వేట—అడవిలో ఉండే చెట్లు, మృగాలు, పిట్టితాలూకు జాబితా——రాజుగారు అలసి విశ్రమించబోయే సరికి సమీపంలో కిన్నెరగానం వొళ్ళు పరవశం చేసేటట్లు వినరావడం——పిదప దేదీప్యమానమైన స్త్రీరత్న దర్శనం——మోహం——తాపం——విరహం——యుద్ధం—— గాంధర్వ వివాహం——భరతవాక్యం.

"ఈవిధంగా యేదో గాధ తీసుకొని, అంకితం యివ్వబోయే రాజుగారిని అందులో నాయకుణ్ణి చేసి, పొగడి మెప్పించి భూమో పుట్రో బహుమానంగా సంపాదించడం,

మనకవుల ముఖ్యోద్దేశం. యమకం, చమకం, ప్రాస, ద్వంద్వార్థ పదాలు, చాంతాళ్లలాటి సంస్కృతసమాసాలు, అచ్చ తెలుగు పదాలు, వీటితో తమ పాండిత్యం వెల్లడిచేస్తూ, ఛందో దోషాలు లేకుండా, కట్టుబొట్లు దాటకుండా, రాజుగారికి కోపం రాకుండా, గ్రంథం తయారుచెయ్యాలి. కథలో సంద ర్భం లేకపోయినాసరే, వర్ణన లేవీ విడిచిపెట్టకూడదు. అనగా పురవర్ణన, ప్రాతఃకాలవర్ణన, సంధ్యాకాలవర్ణన, చంద్రోదయ వర్ణన, చంద్రదూషణ, వసంతఋతువర్ణన, తుమ్మెదల శృంగారగానం, మన్మథదూషణ, నాయికా నాయకుల రూప వర్ణన, (నఖశిఖపర్యంతమును)—సంభోగవర్ణన—"

"అయితే, శాస్త్రులుగారూ, ఇన్ని రాయడానికి ఓపిక వుందిగాని, మనకవులకు కాస్త హాస్యానికే అవకాశం లేక పోయిందా?" అని మెల్లగా నవ్వుతూ అన్నాను.

"అట్లా అంటే, నేనేం చెప్పేది? అవకాశం లేక కాదు. శృంగారరసమే మనకవులకు ప్రధానంగా కనిపించింది. పోషకుల చిత్తవృత్తి ననుసరించి కదా వాళ్ళు కృతులు చేయవలసి యుండెను? అయినా, హాస్యరసంకూడా కొన్ని కొన్ని ప్రబంధాలలో అక్కడక్కడ చిలికి వున్నది."

"ఒకటి రెండు పద్యాలు ఉదాహరణకింద చదవండి" అని శాస్త్రుల్లుగారిని హెచ్చరించాను.

"ఇది చిత్తగించండి :—

అన్నులమిన్నయౌర్తు వసుధాధిపనందనుఁ జూడఁగోరి వా
ల్గన్నులఁ గుంకుమంబు, నొసలన్నవకజ్జలమున్ ధరించి, లో
నెన్నగరానితత్తరము హెచ్చఁగ నచ్చుగ రాజపద్ధతిన్
గ్రన్నన వచ్చె!—దానిఁగని కామినులందఱు నవ్విరొక్కటన్.

ఇది 'రసికజన మనోభిరామము' లోనిదండి, కూచి మంచాయన కవిత్వం చాలా సరసంగాను, హాయిగాను ఉంటుందండి."

"అది నిజమేకాని, యీపద్యంలో నాకేమీ సరసత కానరాలేదండి. వర్ణనలో అతిశయోక్తి యెంతవున్నా, అది కొంచెం స్వాభావికంగా ఉంటేనేకాని, రాణింపులేదు." అన్నాను.

"పోనీ, ఇదిచూడండి. హాస్యం, శృంగారం రెండురసాలు స్ఫురిస్తాయి. ఆ ప్రబంధంలోనిదే:

ఉవిదయొక్కతే వెలికిలనుండి, నీటఁ
జేలుచో, నొక్కరాయంచ తివిరి తమ్మి
మొగ్గ యంచును దాని చన్మొగడ వొడువ
గలికి యులికి, చొకించుక యులికిపడియె."

"శాస్త్రుల్లుగారూ, హాస్యంలో యేదైనా విపరీతభావం స్వాభావికంగా స్ఫురించాలి. ఈపద్యంలో హాస్యరసంపాలు కంటె, శృంగారరసంపాలు జాస్తీగాఉంది. కొంచెం మోటైనా, పద్యం బాగుంది." అన్నాను.

ఆమాట నేరకపోయి, నోరుజారి, యెందుకన్నానా అనిపించింది, చివరకి. ఇట్టి పద్యాలే కాబోలు నేను చదవమన్నాననని, అనుకోని శాస్త్రిల్లువరసపెట్టి, శృంగార నైషధంలో నుంచి రాగవరసతో చదవడం ప్రారంభించాడు. నాకు నవ్వొచ్చి, ఆపుకోలేక, ముఖం పక్కకుతిప్పి చిరునవ్వు నవ్వుకున్నాను. పద్యాలలోఉండేస్వారస్యంగ్రహించి, ఆనందిస్తున్నానని భావించి, ఆయన మరీఉత్సాహంతో చదివేసు పద్యాలు:

'నేత్రిమ నేను, జీరయును నేత్రిమ; చీరకు నాశ్రియింపఁగా
బాత్రితగల్గె, నాకునిటఁ బాత్రితలేదని వామసామ్యవై
చిత్రికతంబునన్ బలిమిఁ జేకొనినట్లుబు రాజాదృష్టి యా
క్షత్రియకన్య చాయకటిచక్రిము నూరుయుగంబు దూకొనెన్.

* * * * *

గంధజలపూరితంబులై కమలముఖుల
కరములందున్న మణిహేమ కలశములకుఁ
జెల్వమగు భీమకన్య చన్నులకునోడి
దాస్యమున నీళ్ళు మోచుచందంబు గలిగె.

* * *

లలన యొకర్తువగ్గు కృకలాసముఁ జేరఁగఁదెచ్చి, వంచనన్
నలునకుఁ గుంచెనట్టు సెలవాగ పదద్వయ మధ్యమంబునన్
నిలిపినఁ గాలు ప్రాకనది నీవిముసీమకుఁ దోశిభామినుల్
గలకల నవ్వ నూడ్చెనది, గట్టిన పుట్టముపాయశూన్యతన్.

* * * * *

అవ్వలి దిక్కు మోమయి ప్రియుంబున నొందులతోడ ముచ్చటల్
దర్శిర్వుచు నొక్కకోమలి పరాకుననుండఁగ, ధూర్తుఁడొక్కరుం
డవ్వల వచ్చి వంచెనమెయిన్ మునుమించు మెఱుంగుటద్దమున్
నవ్వుచుఁ బట్టె దానిచరణంబులకు న్నడుమైన మేఖినిన్.

* * * * *

ఓహో యోహో యిదేమేమొ యేమయేమొ
మేఘపుష్పంబు దేవంచు మేలమాడ,
మేమె మేమేలు దఱచయ్యె మేలు మేలు
మేఁక మేఁకన సభవారు మిగుల నగిరి.

ఇంచినభక్తి నొక్క తరళేక్షణ నైషధభూమిభర్తను
న్నించు వరూధినీపతికి నేరుపుమీఱఁగ వట్టివేళ్ళఁ గా
వించిన తాళవృంతమున వీచుచునుండె; జెమర్చుచుండె నా
చంచలనేత్రి క్రొమ్మిఱుఁగుఁ జన్నుల బింకముఁ జూచి యాతఁడున్.

* * * * *

ఉష్ణశీతాన్న కబళంబు లొక్కఁడు పూపఁ
బవలో రాత్రియొ గెడగూడ నవసరమని,
దాని కుత్తర మొఁక లతాతన్వి యిచ్చె
నధరబింబంబు విడిచి సంధ్యాగమ మని.

* * * * *

మదగజరాజకుంభముల మచ్చరికించు చుగోజకుంభముల్,
గదసి కలంతమేరయును గైకొనియున్నవి యెల్లవారికిన్,
విదితము గాఁగ, నిట్టితరి నీచెలిడెందమునందు నేమియుం
గదలక మాకు నుండ నవకాశము లేదుగదే కళావతీ?

* * * * *

రమణీహృదయంబునను మహారాజ వీవు
గరిమ విచ్చేసి యుండిన కారణమున
దీని వక్షోరుహంబు లాలోననుండ
నెడము లేకున్న మరికదా, వెడలె వెలికి?'

* * * * *

శాస్త్రుల్లుధోరణిఅంతకంతకూ వుద్రేకంతో చెలరేగుతూ వుండడం కనిపెట్టి, యిక ఊరుకుంటే లాభంలేదని, "ఇక

చాలును లెండి...అబ్బా, ఎన్ని పద్యాలు కంఠోపాఠం చేశారు!'' అన్నాను.

"సావకాశంగా కూచుంటే యింకా యితరకవులను వినిపిస్తాను.''

"ఎందుకు లెండి? ఇట్టిపద్యాలుకావు నేనడిగినవి. మీ పూర్వకవులకందరికి ఒక నమస్కారం. వాళ్ళజోలిమనకొద్దు. హాస్యం అన్నా, శృంగారమన్నా, వాళ్ళకు విపరీత భావన లుండెడివని తోస్తుంది'' అన్నాను.

కొంతసేపు నావేపు నిర్ఘాంతపడి చూసి, "అదేమిటి అట్లా సెలవిస్తున్నారు?'' అన్నాడు శాస్త్రులు.

ఇక ఈయనతో వాదించి లాభంలేదని తోచింది!

# సంతాన సమస్య.

ప్రపంచంలో అన్ని దేశాలలోను బుద్ధిమంతులుతీవ్రంగా ఆలోచిస్తున్నా రీసంతానసమస్యనుగూర్చి. కాని 'లోకోభిన్న రుచిః' అన్నారు పెద్దలు. జనసంఖ్య పెరిగినకొద్దీ, దేశానికి శ్రేయమేనని వాదిస్తారు కొందరు; కొంప మునిగిపోతుందని ఘోషపెడతారు మరికొందరు. ఎవరికితోచిన సమాధానాలు వాళ్ళు చెప్తారు. ఉన్ననిజం ఆలోచిస్తేమాత్రం బిడ్డల్ని కనే వాళ్ళు కాని, కననివాళ్ళుకాని దేశాన్నిగూర్చి ముందుగా ఆలోచించుకొని ఏదో నిశ్చితాభిప్రాయానికి వచ్చి ఆవిధంగా ఆచరిస్తున్నారని తోచదు. ఎవరిసంగతి వాళ్ళు తిన్నగా ఆలోచించుకో గలిగితే, లోకానికి మేలుచేసినంతఫలం! సంఘం మాట, దేశంమాట దేవుడెరుగును. ఆత్మ శ్రేయమైనా యోచించుకొని నడుచుకునే బుద్ధిమంతు లెందరున్నారు, ఈ విశాల ప్రపంచంలో?

కోరుకొని పెళ్ళిచేసుకునే ఆచారమైనా లేని మన హిందూదేశములో, మంచిచెడ్డలు వితర్కించుకొని సంతానం పడయడమనేసంగతి హాస్యాస్పదంగా కనిపిస్తుంది. ఒకవేళ ధైర్యవంతుడెవడైనా స్వతంత్రంగా నడుచుకుందుకు సాహసిస్తే, 'పులినిచూసి నక్క వాతపెట్టుకున్నట్లు' పాశ్చాత్యదేశస్థులను చూసి వీడు చెడిపోతున్నాడని మొత్తుకుంటారు మనలో కొందరు ఛాదస్తులు. స్వబుద్ధిచేత ఆలోచించుకోరు. కాని

బిడ్డల్ని కనే విషయంలో మనవాళ్ళు యిప్పటికైనా కళ్ళు తెరిస్తే వాళ్ళకు, బిడ్డలకు, దేశానికి, అందరికీ మేలుకలుగుతుంది.

ఉద్దేశపూర్వకంగా, తపఃఫలితంగా కోరుకొని సంతానం పొందడం మెప్పు. అది జీవితానికి శోభ. కాని మొర్రో వద్దని యేడుస్తూ, అప్రయత్నంగా పిల్లల్ని కనడంకంటె అన్యాయం మరొకటిలేదు. బిడ్డలు పుట్టడం, పుట్టకపోవడం అంతా భగవదేచ్ఛ కాని మనచేతిలో యేమున్నదనీ, తల క్రిందుగా మనం తపస్సుచేసినా విధివశం తప్పించగలమా అనీ వెర్రివేదాంతాలు చెప్పడం బుద్ధిహీనం.

'సంసారసాగరం దుఃఖం, తస్మాత్ జాగ్రత్త!' అని బెదిరించే మనపూర్వులకు సంతాననిరోధమంటే తప్పుగా, అసాధ్యంగా తోచిఉండాలి. పురాణాల్లోను, మహాకవుల కావ్యాల్లోను సంతానప్రాప్తికి దంపతులు పడవలసినపాట్లు కొన్ని పేర్కొనబడి ఉన్నవి కాని నిరోధసాధనాల ప్రసక్తే లేదు. మన ఆయుర్వేదవైద్యులు యీవిషయమై అసలే ప్రస్తావించరు. సామాన్య జనులకు విద్యలేమివలన, చదువుకున్నవాళ్లకు శాస్త్రభయంవలన, స్త్రీలకు సహజమైన సిగ్గువలన సంతాన నిరోధంగూర్చి స్వతంత్రాలోచనలు చేసుకుందుకు వీలులేకుండా ఉంది. కాని మనదేశంలో యించుమించు ప్రతీ మనిషికీ తన సంతానంగూర్చి యేదో ఒకవిధమైన అసంతృప్తి లేకపోలేదు. బిడ్డలు లేనందుకు వగచేవాళ్లు కొద్ది. భరించలేనంతమందిని కనుక్కొని బాధపడేవాళ్ళు జాస్తి. సంఘానికీ,

నీతికి, శాస్త్రాలకి వెరచి శ్లేష్మంలో పడ్డ యీగలవలె కొట్టు కుంటున్నారు వీళ్ళు గత్యంతరం కానక. స్వర్గతుల్యంగా ఉండ వలసిన దాంపత్య సౌఖ్యాన్ని పాడుచేసుకొని జీవితాన్ని నిష్ఫలంగా పొర్లించుకుంటున్న వాళ్ళెందరో ఉన్నారు! వాళ్ళ పిరికితనం, మూఢవిశ్వాసాలు దేశానికెంతో అనర్థం తెస్తు న్నాయి.

పెద్దలయెడల భక్తి చూపడం మంచిదే. సంఘాచా రాలను మన్నించడం అవసరమే. కాని, దేశకాలపరిస్థితుల కనుగుణ్యంగా నరుడు తన ప్రత్యేకజీవితాన్ని నడుపుకోవడం బుద్ధికి లక్షణం. తన్నుమాలిన ధర్మం తెలివిహీనం. పెళ్ళి విషయంలోను పిల్లలవిషయంలోను ఎవరి మంచిచెడ్డలు వారే నిర్ణయించుకోవడం సబబు. సంఘానికి, పెద్దలకి, పూర్వాచా రాలకి వెరచి అనవసరంగా బాధపడడం మన దేశస్థుల ప్రారబ్ధం కాబోలు!

అజ్ఞానం, దరిద్రం, రోగాలు, అకాల మృత్యువులు దేశంలో అంతకంతకూ అధికమవుతున్నాయి. శరీర బలం, మనోబలం, మనలో క్రమంగా నశిస్తున్నాయి. పాడిపంటలకు ప్రసిద్ధిచెందిన యీ పుణ్యభూమిలో ఆకలిబాధకు తాళలేక జనులు యేడుస్తున్నారంటే, యెందుచేత? అర్థంలేకుండా పెరు గుతూ వున్న జనసంఖ్య, మూర్ఖంగా బిడ్డల్ని కలిపించే అసం దర్భ వివాహాచారాలు కొంతవరకు యీదుస్థితులకు కార ణాలని తోస్తుంది.

వెనకటిరోజుల వైభవం స్మరించుకొని సంతోషించడం వెర్రి. ఇప్పటిరోజుల దుర్దశకు వగచి యేడవడం నిరర్థకం. రాబోవు రోజులను గూర్చి సాధక బాధకాలన్నీ బాగా విమర్శించుకొని, సాధ్యమైనంతవరకు స్వతంత్రబుద్ధిచేత ప్రతీ మనిషీ తనజీవితాన్ని సౌఖ్యప్రదంగా చేసుకోవడం ధర్మం.

సృష్టిలోఉన్న విచిత్రాల్లోకల్లా, బిడ్డలు పుట్టడమనే చిత్రం మహా అద్భుతమైనది. జీవరాసులకు గల శక్తులలోకల్లా బిడ్డలుకనే శక్తి ఒక్కటే వాటిలోఉండే దేవత్వాన్ని నిరూపిస్తూవుంది. అట్టి అమూల్యమైన శక్తిని దుర్వినియోగం చేసుకొని, మానవుడు లేనిపోని కష్టాలనుభవిస్తున్నాడు. బహుశః మరికొన్ని శతాబ్దాలు గడచినపిమ్మట గాని యీ శక్తిని తనస్వాధీనంలోకి తెచ్చుకోలేడేమో నరుడు!

దేవు డనుగ్రహించిన బిడ్డలుకనే శక్తితో నేటి మానవుడు తృప్తిపొందలేకుండా ఉన్నాడు. కోరిన బిడ్డను, కోరిన సమయమందు పొందడానికి ప్రయత్నిస్తున్నాడు. పెద్దపెద్ద శాస్త్రవేత్తలీవిషయమై వింతవింత శోధనలు చేస్తున్నారు. పురుషుడి జోక్యంలేకుండా స్త్రీకి గర్భంవచ్చే ఉపాయమేమిటని వెతుకుతున్నారు. బ్రహ్మదేవుడు మట్టిబొమ్మల్ని చేసి జీవం పోసినట్లు, మనంకూడా 'లేబొరేటరీ'లో బిడ్డలను సృష్టించగలమా అని ఆలోచిస్తున్నారు. దీనినే "ఎక్టోజెనిసిస్" శాస్త్రమంటారు. అసహజసాధనాలవల్ల బిడ్డలను నిర్మించగల ఉపాయమే నరుడు కనిపెట్టగలిగితే దేవుణ్ణి ధిక్కరించి మృత్యువును జయించవచ్చును. ప్రపంచం తల్లక్రిందచేయవచ్చును!

ప్రకృతికి విరుద్ధంగా బిడ్డల్ని సృజించడం మనకు సంక్రమించిన కోర్కె కావచ్చును. కాని పిల్లలక్కరలేనివాళ్ళు కన వలసిన నిర్బంధంలేకుండా జాగ్రత్తపడవచ్చును. సాధారణంగా మనదేశంలో బిడ్డలపుట్టుక బలవంతబ్రాహ్మణార్థంవలె ఉంటూవుంది దంపతులకు. కనేవాళ్ళ యిష్టంలేకుండా పుట్టే బిడ్డల సంఖ్య అపరిమితం!

బిడ్డల్ని కనడమంటే సహజమే కాని నిరోధించుకోవడ మనేది దాంపత్యధర్మంకాదనీ, అసహజమనీ, అక్రమమనీ, ప్రకృతివిరుద్ధమనీ, చాలమంది ఉద్దేశం. సంతానం పొందడానికి యెన్ని ఉపాయాలాలోచించినా ఆక్షేపణలేదు. నిరోధన సాధనాల విషయమై మాత్రం నోరెత్తి గట్టిగా మాట్లాడితే తప్పు!

ఇతరదేశాలలో యింత అన్యాయంలేదు. హాలెండులో సంతాన నిరోధనజ్ఞానం ప్రజలలో విపులంగా వ్యాపింపజేయడానికి గవర్నమెంటువారే శ్రద్ధవహిస్తున్నారు. ఇంగ్లాండు, అమెరికా, మొదలైన దేశాలలో అనేకులు నిర్భయంగా నిరోధనవిధానా లవలంబిస్తున్నారు. ఒక్క ఇటలీలోమాత్రం తనప్రజలు బిడ్డల్నికనడంలో అశ్రద్ధవహిస్తే వొప్పుకోకుండా ఉన్నాడు 'ముస్సొలీనీ' ప్రభువు. హిందూదేశంలో మోస్తరు మట్టుకు భూలోకంలో ఎక్కడా ఉండదు. పిల్లల్ని కనడానికి శక్తిలేక, కోరికలేక, ఆనందంలేక, అప్రయత్నంగా, అజ్ఞానంగా, గుడ్డిగా సంతానాలు పొందుతూ, యేడుస్తూ, మొత్తుకుంటూ, నవ్వుకుంటూ, అఘోరిస్తున్నారు మనదేశంలో

అనేకులు. జీవితాశయాలులేవు వీరికి. ఉద్దేశాలులేవు, చేసే పనులకు! విద్యలేదు. స్వాతంత్ర్యంలేదు. గమనుతనంలేదు. అమాయకంగా అడవిమృగాలవలె తింటూ, అరుస్తూ, పిల్లల్ని కంటూ జీవయాత్ర గడిపే అభాగ్యులువీరు. పడేకష్టాలు, పొందేసుఖాలు, అన్నీ తమకర్మానుబంధాలే అని భావించుకో గల వేదాంతబుద్ధిగల ధీరులు!

బిడ్డలు కావలసినవారు అవశ్యం కనవచ్చును చిత్తం వచ్చినంతమందిని. సంతానాభిలాషగలవాళ్ళు చేసే అర్థంలేని పనులనుకూడా మనం వెక్కిరించకూడదు. పూర్వులు తపస్సులు చేసేవారట సంతానంకొరకు దేవుళ్ళు ప్రత్యక్షమై వారికి వరాలిచ్చేవారు. ధర్మసంతానాలకు సంఘం తప్పు పట్టేదికాదు. ఈరోజులలో తపస్సులు చేసేవాళ్ళులేరు. చేసినా దేవుళ్ళు ప్రత్యక్షంకాకుండా ఉన్నారు. అంచాత సంతానప్రాప్తికి, యిప్పటివాళ్ళు చేసే సాధనాలు కొంచెం సుళువుగాఉంటాయి. దేవుళ్ళకీ, దెయ్యాలకీ మొక్కుకుంటారు. ముడుపులు కడతారు. మాంత్రికులనీ, బైరాగులనీ, భస్మాలకోసం ఆశ్రయిస్తారు. ఎరుకులవాళ్ళనీ, జ్యోతిష్కులనీ బ్రతిమాలి ప్రశ్న చెప్పించుకుంటారు. వైద్యులకు డబ్బిచ్చి ఔషధాలు పుచ్చుకుంటారు. నోములు, జపాలు, దానాలు, తీర్థయాత్రలు—ఎన్నెన్ని చెయ్యాలో అన్నీ చేస్తారు. వారి మూఢనమ్మకాలకుగాని, అనాగరికతకుగాని యెవరూ ఆక్షేపించరు. అభ్యంతరంచెప్పరు. హిందూ ముత్తైదువ యేదైనా సహించుకోగలదు కాని, గొడ్రాలితనంమాత్రం సహించుకోలేదు.

బిడ్డలు కావాలన్న వాళ్ళ అవస్థలు యీవిధంగా ఉండగా, అక్కరలేదన్న వాళ్ళ మొర్రి వినేవాళ్ళు లేరు. సంతానం వద్దో అని ఆ బ్రహ్మదేవుడికి విన్నవించుకొని యెన్ని పూజలు, వ్రతాలు చేసినా ప్రయోజనం లేకుండా ఉంది, చాలామంది అభాగ్యులకు! పిల్లల్ని కనడానికి అయిష్టతగల వాళ్ళందరూ దుర్మార్గులనీ, ధూర్తులనీ, అమానుష ప్రకృతిగల రాక్షసులనీ, నీతి దూరులనీ అనుకోకూడదు. నిష్పక్షపాతబుద్ధితో ఆలోచిస్తే, పిల్లల్ని కోరేవాళ్ళ యెడల చూపవలసిన గౌరవం కన్న, సంఘం వీరిపట్లనే యెక్కువ సానుభూతి చూపవలసి ఉంటుంది.

బిడ్డల్ని కనుక్కోవాలన్న కోర్కె సాధారణంగా ప్రతి మనిషికీ ఉంటుంది. అట్టి కోర్కె సహజమేగాక సంఘాభివృద్ధికి అవసరమని కూడా చెప్పక తీరదు. భార్యాభర్తలను అన్యోన్య ప్రేమపాశాలతో బంధించడానికి యేర్పడ్డ మంత్రబలంగల మంగళసూత్రం కంటె, దాంపత్యసుఖంవల్ల జనించిన జానెడు శిశువుకు యెక్కువ శక్తి ఉంది. అందుకనే 'అపుత్రస్య గతిర్నాస్తి' అన్నారు పెద్దలు. దాంపత్యానికి సౌఖ్యం, సంఘానికి గౌరవం, దేశానికి బలం చేకూర్చగలవాళ్ళు బిడ్డలు. సంసారంలో వచ్చే ఒడుదుడుకులకు సంతాన సహాయ్యంమీదనే ఆధారపడతారు తలిదండ్రులు. వృద్ధాప్యంలో అక్కరకు వచ్చేవారు పిల్లలే కదా అని ధైర్యపడతాడు తండ్రి. భూమిని పెకలించి సంపాదించిన రత్నాలవలె, తన దేహం చీల్చుకొని కనుక్కున్న బిడ్డల్ని భర్తకీ, లోకానికీ యివ్వగలిగినందుకు గర్విస్తుంది తల్లి. ఉత్సాహం, ఉద్దేశంగల దంపతులు కోరినంత

మందిని కనుక్కోవలసిందే. పిల్లలుకావాలని కోర్కెగల వాళ్ళకు ఆరోగ్యం, శరీరదార్ఢ్యం ఉండి, సంతానపోషణకు సరిపడే డబ్బుఉంటే, 'అధికస్య అధికం ఫలం' అన్నట్లు, ఎంత మందినైనా కనుక్కోవచ్చును.

అయితే లోకంతీరు ఆవిధంగాలేదు. కావాలన్నవాళ్లకు సంతానం ఉండదు. అక్కరలేనివాళ్ళకు గంపెడేసి పిల్లలు! ఆస్పృష్టికర్త చిద్విలాసం యీవిధంగా ఉంది. మనుష్యులలో గాక, యితర జీవరాసులలో కొంతవరకు యీఅనర్థాలు సర్దుకుంటాయి, ఏదోఒకవిధంగా. 'సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్' అన్న న్యాయం ఒక్కటే వర్తిస్తుంది వాటిలో..

మనిషికీ, తక్కినజంతువులకీ యీవిషయంలో కొంత వారాఉంది. తన జ్ఞానసహాయంవలన మానవుడు ప్రకృతిని జయించగలుగుతున్నాడు. అతడు తనసదుపాయంకోసం చేసుకున్న పనులన్నీ ప్రకృతికి విరుద్ధంగానే ఉంటాయి, ఇంచుమించు! తిండిలో, నిద్రలో, శరీరపోషణలో, నడవడికలో— అన్నిటిలోను అసహజంగానే వర్తిస్తాడునరుడు. కాని సంతాన విషయంలో మట్టుకు నేచర్‌కు వ్యతిరేకంగా నడుచుకుందుకు ఎందుకో సంకోచిస్తాడు.

ఇప్పటిమోస్తరుగానే భూలోకం మొత్తంమ్మీద జన సంఖ్య దినే దినే పెరుగుతూఉంటే, కొద్దికాలానికే మహాప్రళయమేదో సంభవిస్తుందని చెప్తున్నాడు, హెచ్. జి. వెల్స్ దొర. భూమియిచ్చే పంట అందరితిండికీ సరిపోదనీ, ప్రజల

ఆరోగ్యం చెడిపోతుందనీ, మనలో ఉండే దైవిక గుణాలు నశించి, రాక్షసులవలె మనం ఒకరినొకరు చంపుకొని భక్షిస్తామనీ, చెప్తున్నారు దివ్యజ్ఞానంగల మహానుభావులు. వారి బెదిరింపులు అక్షరాలా నిజం కాకపోవచ్చును. అదిగాక, లోకానికి సంభవించే అనర్థాలన్నిటికీ ప్రతీమనిషీ ఉత్తరవాది కాజాలడు. యుద్ధాలకు, భయంకరమైన వ్యాధులకు తుపానులకు, భూకంపాలకు, వరదలకు, అగ్నిపర్వతాలకు, ప్రమాదాల వల్ల కలిగే అసహజమైన చావులకు, కరువులకు, మొదలైన వాటికి పూచీదారులెవరు? సృష్టిలో జనన మరణాలను కంట్రోల్ చేయడానికి బహుశః భగవంతు డేర్పరుచుకున్న విధానాలు కాబోలివి!

లోకాన్ని ఉద్ధరించడానికి కాకపోయినా, స్వలాభమైనా చూచుకొని, ప్రతీమనిషీ తన సంతానం విషయమై కొంత శ్రద్ధవహించి నడుచుకోవడం మంచిది.

ప్రస్తుతం మనదేశంలో సంతానంగొడవ చాలావిచారకరంగా ఉంది. అంగవిహీనులు, అంధులు, బలహీనులు, అల్పాయుష్మంతులు అధికమౌతున్నారు. పుట్టినపిల్లలుబలంగా, ఆరోగ్యంగా ఉండడంలేదు. వాళ్ళకు సరియైన ఆహారపోషణ, దేహపరిశ్రమ,ముద్దుముచ్చటలు, లభించడంలేదు. బాలింతలు, శిశువులు, వేలకొలది యేటామరణిస్తున్నారు. ఎన్నో కుటుంబాలలో అశాంతి, దుఃఖం విశదమౌతున్నాయి. మొత్తంపైని శోకమయంగా ఉన్నాయి పలువురిజవితాలు. సంతాన నిరోధ నావశ్యకతను సూచించుటకు దేశంలో ఉండే దరిద్రమొక్కటే

చాలును. 'ఎట్టివారు బిడ్డల్ని కనడానికి అర్హులు? ఎంతమందిని కనడం సబబు? ఎట్టిస్థితులలో కనడం మంచిది?' అనేప్రశ్నలకు సమాధానా లాలోచించుకొని కాపురాలు చేసేవాళ్ళెంద రున్నారు మనదేశంలో?

పెళ్ళిలేకుండా ఉండడం మనవాళ్ళకు నీతి విరుద్ధం! సంఘాచారాలనుబట్టి ప్రతీమనిషీ పెళ్ళిచేసుకొని తీరవలసిందే. శాస్త్రాలలో పెళ్ళిళ్ళకెట్టి కట్టుదిట్టాలు సూచింపబడినా, ఆచరణలో మాత్రం యెట్టి అసందర్భపు వివాహాలకైనా ఆక్షేపణలేకుండా ఉంది. ముసలివాడు చిన్నపిల్లను చేసుకుంటున్నాడు. మంచిబలంగల ముష్కరుడు ఊపిరిలేని సుకుమారిని కట్టుకుంటున్నాడు. ఘాటైడు రోగాలతో ఉన్న పుచ్చివాడు పవిత్రమైన కన్యను చేపట్టి చెరుస్తున్నాడు. తనపొట్ట తాపోషించుకోలేని అప్రయోజకుడు పిల్లలతండ్రి కావడానికి సిద్ధపడుతున్నాడు. సాధారణంగా వయస్సు, దేహారోగ్యం, డబ్బు, రూపం, ప్రేమ యేవీ అవసరంలేని పెళ్ళిళ్లు మనవి! అన్నీ సవ్యంగాఉన్న దంపతులకు సంతానవిషయమై తగిన జ్ఞానం, ధైర్యంలేక చెప్పుకోలేనన్ని విచారాలు.

భార్యాభర్తలకు శరీరావయవాలు పరిపక్వానికి రాక మునుపే చిన్నవయస్సులో శోభనం. గర్భాదానమైన కొద్ది రోజులకే పెళ్ళికూతురుకు వేవిళ్లు. నెలలునిండకుండా నొప్పులు. పురుడు గడవడమొక పెద్దగండం. గట్టిగా యేడవలేని కొన ఊపిరితోఉన్న జానెడుబిడ్డ. తల్లి మంచంపట్టిపోయి మూడు నెలలదాకా తేరుకోలేకపోవడం. పిల్లకు చనుబాలులేకపోవడం.

శిశుసంరక్షణ విధానం తెలియక ఆతల్లి నానా అవస్థలూ పడడం. సెలఫురిటీనుండి పిల్లకు జబ్బులు. మందులు, దృష్టిదోషాలకు మంత్రాలు. ముసలమ్మలు పెట్టే భూతభయాలు. దేవుళ్ళకు, దేవతలకు మొక్కులు. మళ్ళీ సాధ్యమైనంత త్వరలో తల్లికిగర్భం! ఈవిషమచక్రంలోపడి కొట్టుకునే దంపతులకు మరిముక్తి, మోక్షం యెక్కడ? దేవుడిచ్చిన యౌవనసౌందర్యాలు త్వరలో మాపు మాసి, శరీరదార్ఢ్యంచెడి, నడివయస్సులో ముసలిదిగా కనబడే తనభార్యమీద భర్తకు క్రమంగా మోహంచచ్చి, పడకగది చూస్తే విరక్తి, భయం పుడతాయి. ఏడాదికో, రెండేళ్ళకో ఒక్కొక్క బిడ్డచొప్పున పుడుతూ ఉంటే ఆపిల్లలకు సరియైన సంరక్షణ యెట్లావుంటుంది? ఆతల్లికి యెంతకష్టం? డబ్బుకు యెంతయిబ్బంది? కాళ్ళకు సంకెళ్ళవలె చుట్టుకున్న పిల్లల్ని విడిచిపెట్టలేక గాని, లేకుంటే గృహస్థాశ్రమం యెత్తిపెట్టి సన్యాసం పుచ్చుకోవాలనిపిస్తుంది అట్టి తలిదండ్రులకు.

బిడ్డల్ని కనడంలో పురుషుడికిగల బాధ్యతలు తక్కువ. కష్టమంతా ఆడదానిది. కాని, ఆమెసంగతి విచారించడు భర్త. ఎంతసేపూ తనసౌఖ్యం, తనసదుపాయం, తనఆరోగ్యం, తనగొడవే చూసుకుంటాడు. బిడ్డమీద బిడ్డ పుట్టుకొస్తూ వుంటే చికాకుపడి, పెళ్ళాన్ని తిడతాడు—తప్పంతా తనయందుంచుకొని. పాపం నోరెత్తక ఆయిల్లాలు అన్నిటికీ ఓర్చుకోవాలి. వివాహమంటే హిందూ స్త్రీ అనుభవించే సౌఖ్యం యిది! మానం, ప్రాణం, ఆరోగ్యం అన్నీ మొగుడికి ధారపొయ్యాలి. విద్యలేక, స్వాతంత్ర్యంలేక, సౌఖ్యంలేక—

యింటికి బానిసై, భర్తకు బిడ్డలుకనే యంత్రమై, సంఘానికీ కులాచారాలకీ వొదిగి, ఆత్మాభిమానం చంపుకొని, అభాగ్య జీవనం గడపాలి. బిడ్డలవిషయమై ఆమె యిష్టాయిష్టాలతో యెవరికీ పనిలేదు. భర్తను తృప్తిపరచడమే ఆమెకువిధి!

సంతాన నిరోధనశాస్త్రం మన స్త్రీలలో బాగా వ్యాపిస్తేనేకాని యిట్టి ఘోరాలు కొంతవరకైనా తగ్గవు. బిడ్డల్ని కనిపెంచే సమర్థురాలు ఆడదే గనుక, ఆమెయిష్టాన్ని అనుసరించే సంతానాలు కలగాలి. పురుషులు తగిన శ్రద్ధతీసికొని స్త్రీలకు నిరోధనసాధనాల మంచిచెడ్డలు బోధించాలి.

సంతాన నిరోధనజ్ఞానం అందరికీ విశదపరచడంవల్ల దేశంలో దుర్నీతి ప్రబలుతుందని కొందరిభయం. జ్ఞానాభివృద్ధివలన దుర్నీతి అణగడం సహజంకాని, పెరగడం అసందర్భం. గర్భంరాకుండా కాపాడుకునే ఉపాయం ఆడదానికి తెలిస్తే యిష్టంవొచ్చినట్లు చెలరేగి, కాని పనులుచేస్తుందనీ బిడ్డలుకనడం అందరూ మానేస్తే, క్రమంగాజనసంఖ్య క్షీణించిపోయి సృష్టే అంతరించిపోతుందనీ గోలపెడతారీ నీతిమంతులు. ఆడదాన్ని సంఘం అజ్ఞానంలో అణగదొక్కి ఉంచబట్టి ఆమె బుద్ధిగా ఉంటూవుందనీ, లేకుంటే నీతితప్పి ప్రవర్తించితీరుతుందనీ భావించడం అధర్మం. కడుపువస్తుందన్నభయమే నిజంగా ఆడదాని శీలాన్ని కాపాడుతూ ఉన్నట్టయితే, మగవాడి కట్టిభయంలేదు కాబట్టి, అందరు పురుషులూ నీతిదూరులే అన్న అసందర్భ సారాంశం తేల్తుంది! స్త్రీలపట్ల అన్యాయంగా దురభిప్రాయాలు పెట్టుకోవడం పురుషులు తమ అల్పబుద్ధిని

ప్రకటించుకోవడమన్న మాట. ఇక జ్ఞానాభివృద్ధివలన భగవంతుని సృష్టికి అంతరాయం కలుగుతుందేమో అన్న రెండోవాదన మరీ విపరీతంగా ఉంది. బిడ్డలుకావాలని కోర్కెగలవాళ్లు నిరోధన సాధనాలవలంబించరు. అవలంబించ నక్కరలేదు. కాబట్టి, అనవసరసంతానాలు పొందుతున్నవాళ్ళకే యీ నిరోధనజ్ఞానం ఉపచరిస్తుంది. అప్పుడు దేశంలో అందరూ సత్సంతానాలు పొందుతూ హాయిగా, నిర్విచారంగా గడుపుకుంటారు తమతమ సంసారాలను. దంతుల ప్రణయజీవిత మొక నిర్భయానంద స్వప్నంవలె మధురంగా గడచిపోతుంది.

